*Issued on 21— 1—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*SUNDAY, the 25th MARCH, 1956.*

VOLUME VI — No. I.

## CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL

1957

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Sunday, the 25th March* 1956

The House met in the Assembly Hall, Kurnool, at four of the clock, Mr. Speaker (Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. GOVERNMENT MOTION

### DRAFT OUTLINE OF THE SECOND FIVE YEAR PLAN—(*contd.*)

MR. SPEAKER :—The House will now continue discussion on the Draft Outline of the Second Five year Plan.

[*Note* : An asterisk* at the commencement of a speech denotes revision by the Member]

SRI M. VENKATA RAJU :—అధ్యక్షా, రెండవ పంచవర్ష ప్రణాళికను ఎంతో ప్రావీణ్యతగలవారు, ఎన్నో విషయములు ఆలోచించి తయారుచేశారు. అటువంటిదానిని నాబోటి ఏమీ తెలియనివాడు విమర్శించడం, ఆక్షేపించడం న్యాయముకాదు. భారత ప్రభుత్వముతరఫున, 35 కోట్లమంది అది భారతీయులకు సంబంధించిన ఈ నిర్ణయాన్ని, అన్నిరకాల గొప్పవారు కూర్చొని చేశారు. ఇంకా ఎన్నోవిషయాలు ఆలోచించి ప్రజలను దృష్టిలో పెట్టుకొని, ప్రజలయొక్క అవసరములకొఱకు దీనిని తయారుచేశారు మనదేశం ఇప్పుడు చాలా లోటుబడ్జటుతో ఉన్నది. అందువల్ల దానికి కావలసిన ధనం ఎక్కడ్నుంచి వస్తుంది, ఏ విధంగా వస్తుంది, ఎవరివల్ల వస్తుంది అనే విషయంలో అట్టే బాధపడవలసిన పనిలేదు. ప్రధానముగా ఈ విషయములన్నియూ దృష్టిలో పెట్టుకొనే వారు దీనిని తయారు చేశారు. మొదటి పంచవర్ష ప్రణాళికలో ఏమేమి పనులు చేయలేకపోయారో, వాటినన్నింటినీ దృష్టిలో పెట్టుకొనే రెండవ పంచవర్ష ప్రణాళికను తయారుచేశారు. నిన్న ప్రతిపక్షనాయకుడు మాట్లాడుతూ మొదటి పంచవర్ష ప్రణాళికలో దేశం ఏమీ అభివృద్ధిలోకి రాలేదన్నారు. రెండవ పంచవర్ష ప్రణాళికకు కేటాయించిన డబ్బు మొదటి ప్రణాళికకన్నా తక్కువగా ఉన్నదన్నారు. ప్రథమ ప్రణాళిక కన్నా రెండు రెట్లు రెండవ ప్రణాళికకు ఖర్చు పెడుతున్నారు. దానివల్ల ఇది అభివృద్ధి దాయకము అనుకోవడానికి ఏమీ ఆక్షేపణలేదు.

మొట్టమొదటి ప్రణాళికలో ముఖ్యంగా మన దేశమునకు కావలసిన ఆహార సమస్యను తీసుకున్నారు. అది పూర్తి అయ్యేసరికి మన దేశంలో ఆహార [illegible]

పోయింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రధానంగా పరిశ్రమలను తీసుకొన్నారు. దానిని రెండు విధాలుగా భాగించారు. (1) పెద్దపెద్ద పరిశ్రమలను కొన్నింటిని వ్యక్తుల ద్వారా చేయించడము, (2) కొన్ని కొన్ని ప్రభుత్వమే చేయడంగా వారు కార్యక్రమం పెట్టుకున్నారు. వ్యక్తుల పరంగా చేయించే విషయములో కొన్ని నిబంధనలు పెట్టి, ఉత్పత్తిమీద ప్రభుత్వానికి కంట్రోలు పెట్టుకొని, దానికి వినియోగించే డబ్బులో ప్రభుత్వమువారుకూడా ఎక్కువ పాలుయిస్తూ, అనేక కట్టుదిట్టములతోటి వాటిని ఏర్పాటు చేస్తున్నారు. అందువల్ల మనము ఆ విషయములోనూ ఏమీ బాధపడవలసిన అవసరములేదు. ఇనుము, ఉక్కు మొదలైన పెద్ద పరిశ్రమలను ప్రభుత్వమే స్వంతంగా ఖర్చుపెట్టి నడుపుతున్నారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో అనేక ఇరిగేషను స్కీములు అమలులో పెట్టారు. వాటిలో కొన్ని పూర్తిఅయినవి, కొన్ని పూర్తికాలేదు. పూర్తి కాని వాటిని రెండవ పంచవర్ష ప్రణాళికలో పూర్తి చేస్తారు. సింద్రి ఎరువుల ఫ్యాక్టరీలో ఉత్పత్తి అయ్యే ఎరువులకంటే అధికంగా ఉత్పత్తి చేయడానికి ఇంకొ మూడు ఫ్యాక్టరీలు అంతంతవి కట్టడానికి నిశ్చయించారు. అదేవిధంగా మంచి మంచి విత్తనాలు కూడా ఎక్కువగా తయారుచేసి రైతులకు ఇచ్చేదానికి రెండవ పంచవర్ష ప్రణాళికలో నిశ్చయించారు

అడవులలో వ్యవసాయానికి పనికివచ్చే భూములన్నీకూడా ట్రాక్టర్లతో సమానంగా చేసి వ్యవసాయానికి అనుకూలంగా ఉండేటట్లుచేసి బీదవారికి పంచే ఏర్పాటులు చేశారు. భూవసతిని పరిమితి చేసి, మిగిలిన భూములను బీదలకు ఇచ్చే ఏర్పాటులుకూడా చేశారు. చిన్నచిన్న ఖండాలుగా ఉన్న భూములు అధిక పంటకు వీలుకాదు కాబట్టి, కో-ఆపరేటివ్ సొసైటీలద్వారా, పెద్దపెద్ద ఖండాలుగా చేసి ఎక్కువ పండించే దానికి అవకాశములు కల్పించారు. అన్నివిధాల ఇప్పుడు భారతదేశం స్వయం సమృద్ధిగా ఉన్నది. పాలు, నెయ్యి కోడి గ్రుడ్లు, మాంసము మొదలగు తిను బండారములు చాలినన్నిగా దేశంలో ఉత్పత్తి కావడములేదు.

వాటిని ఉత్పత్తి చేయుటకు రెండవ పంచవర్ష ప్రణాళికలో అవకాశము కల్పించారు. ఈవిధంగా ప్రతి చిన్న విషయములో వారు జోక్యము కల్పించుకొని అభివృద్ధికొఱకు ప్రయత్నము చేస్తున్నమాట నిజమే అని, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఋజువు చేస్తున్నది. దీనికి కావలసిన డబ్బు సుమారు 4,800 కోట్లు రూపాయిలు, వ్యక్తుల పరంగా ఏవిధంగా వసూలు చేసుకోవాలో వివరాలు ఇచ్చారు. ఎట్లా వసూలుచేసినా ఇంకా 200 కోట్ల రూపాయిలు ఆదాయం తక్కువఅవుతుందని చెప్పారు. ఇతర దేశములనుండి 500 కోట్ల రూపాయలు అప్పులు చేస్తున్నాము.

భూమికి గరిష్ట, కనిష్ట పరిమాణము పెట్టిన తరువాత, వ్యక్తిగత ఆస్తులకు పెట్టలేదనే బాధ చాలామందికి ఉన్నది. రైతులలోనే ఆ బాధ ఎక్కువగా ఉన్నది అందువల్ల వ్యక్తిగత ఆస్తులకుకూడా పరిమాణము పెట్టి ఎక్కువగా ఉన్న డబ్బును తీసుకుంటూ, ఈ ప్రణాళికకు కావలసిన డబ్బును వసూలు చేసుకోవడానికి వీలుంటుంది.

పరిశ్రమలలో పనిచేసే కూలీలకు ప్రభుత్వం అనేకవిధాలుగా సౌకర్యాలు కలుగ జేస్తున్నది వారికి విద్య విషయములో ఆరోగ్య విషయములో, మందులు అందజేసే విషయములో బోనసు ఇచ్చే విషయములో భీమా పద్ధతులను అమలుపరచు విషయంలో, అనేక విధాల సహకారము చేస్తున్నారు. కాని వ్యవసాయ కూలీలకు ఏ విధమైన వసతులు కల్పించలేదు వ్యవసాయము పై ఆధారపడిన వారి సంఖ్య ఇప్పటికే అధికంగా ఉన్నది. ప్రజలు పల్లెకుపోయి ఐచ్ఛికంగా ఇతర వృత్తులను చే బట్టడం ఆర్థిక వ్యవస్థకు మంచిది అంటున్నారు.

గ్రామములలోని ప్రజలు ఆహారపదార్థములు చాలక వారి బిడ్డలకు చదువు చెప్పించుకొనుటకు సదుపాయములు లేక భూమిమీద ఆధారపడి జీవించుటకు వీలు లేక బాధపడుతున్నారు. వారిని ఇతరవృత్తులేమయినా చేసుకోమని ప్రభుత్వం చెబుతున్నది. ఇతర వృత్తులు ఎక్కడఉన్నాయి ? ఏ విధంగా జరుగుతుంది. వారికి వృత్తులు ప్రభుత్వంవారే చూపించాలి. మనదేశం ముఖ్యంగా వ్యవసాయకదేశం. "ధనవంతులు చిన్న చిన్న పరిశ్రమలకు, పంచదార ఫ్యాక్టరీ, సిమెంటు ఫ్యాక్టరీ మున్నగువాటికి ధనం యివ్వకుండా ఉండుటవలన మనదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందడంలేదు" అని మంత్రిగారు చెప్పారు దీనికి ఇంకో విధానం ఏదైనా అవలంభిస్తే బాగుంటుందేమో ఆలోచించవలసినదని నేను మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. అట్లు చేయుటకు మనకు Rules అనుకూలంగా లేకపోయినట్లయితే కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించి న్యాయంచేయవచ్చును. ధనికవర్గంవారు వారిదగ్గరఉన్న డబ్బును బంగారం రూపంలోనో, నోట్లరూపంలోనో దాచుకొని బజార్లలోకి రాకుండా చేస్తున్నమాట నిజమే వారిదగ్గర లక్షలకొలదీ డబ్బుఉంది. దానితోనే మన పంచవర్ష ప్రణాళికలన్నీ పూర్తిఅవుతాయనికాదు. ధనవంతులదగ్గర dead capital లేకుండా చెయాలి. రైతుదగ్గర భూమిఎక్కువగానున్నది. పంటకు సాయకీగాలేని భూములను చేసుకునేవారికి తిండి వసతులు కలుగచేయుటకొరకు భూసంస్కరణలుపెట్టి ధనవంతులదగ్గరమున్న dead capital ను తీసుకొనడానికి ప్రయత్నంచేయాలి, ఇదివరకు కేంద్రప్రభుత్వంవారు 2 రూపాయలనోట్లు చెల్లవని Order pass చేశారు. అట్లాగే ఇప్పుడు 100 రూ॥ల నోట్లు పనికిరావు అనండి.

Sri M. Venkata Raju] [25th March 1956

ధనవంతులదగ్గరఉన్న 100 రు ల నోట్లు బయటకువస్తాయి. అట్లాగే మహారాజుల దగ్గర బంగారము, నగలరూపంలో ఉన్నది. అట్లాగే 2, 3 నెలలు time యిచ్చి బంగారముధర సవరను 30 రు॥లు చేసినామనండి. ఆ బంగారమును అమ్ముకొనుటకు వారు బజారుకు తీసుకొనివస్తారు. ఆ తీసుకువచ్చిన dead capital ను ప్రభుత్వం వారు బాండుమీద అప్పుగా తీసుకోండి. ఆ డబ్బుతో చిన్న చిన్న పరిశ్రమలను అభివృద్ధిచేయండి. ఇటువంటి చిన్నపనులకుకూడా ప్రభుత్వం పూనుకొనట్లయితే ప్రజలలో అసంతృప్తి బయలుదేరుతుంది. చైనాలో అమ్మకం బాగా జరుగు తోందని నిన్న సుందరయ్యగారు అన్నారు. చైనాలో చేసినట్లుగా మనం చేయ కూడదు. అక్కడివారు జమీందారులపై దౌర్జన్యంగా దాడిచేసి వారి ఆస్తులను తీసుకొని పంచవర్ష ప్రణాళికక్రింద ఖర్చుచేస్తున్నారు. కూలీలను నిర్బంధించి "మీరు ఫలానా 4 ఫర్లాంగులరోడ్లును 3 రోజులలో వేయాలి. లేకపోతే మీ తలకాయ తీసేస్తామని" బెదిరించి వారిచేత పనిచేయిస్తున్నారు. రాజకీయంగా వారికి వ్యతిరే కాభిప్రాయంతోఉన్న అనేకలక్షలమంది ప్రజలను తీసుకొనివచ్చివారికి తిండిపెట్ట కుండా పనులు చేయించారు. అందువల్ల నెలరోజులలో పూర్తిఅవ్వవలసినపని 25 రోజులలో పూర్తిఅవుతుంది. కాని మన భారతదేశంయొక్క సిద్ధాంతం అదిగాదు. అట్టివిధంగా మన plan లను అమలు జరుపుకోనక్కరలేదు. ఇప్పుడున్న ప్రతి పక్షనాయకులు మనమీదకు ఏ సమయంలో ఏమి ప్రమాదంవస్తుందో, మనకు మందుగుండు సామానులేదు. తుపాకీలేదు, వీటికి 2 వ పంచవర్ష ప్రణాళికలో ఏమీ చూపించలేదని బాధపడుతూ రెండు మూడుసార్లు చెప్పారు. అసలు మనకు యుద్ధములువద్దు. మనది బుద్ధునియొక్క సిద్ధాంతము. బుద్ధునియొక్క "అహింసో ధర్మః" అనే సిద్ధాంతం మూలంగా మనదేశం బానిసదేశమైనది. మళ్ళీ యింకొక సారి అట్లుజరిగినట్లయితే సత్యాగ్రహం చేస్తాము. కాని యుద్ధంచేయవలసిన అవ సరంలేదు. ఇప్పుడు యుద్ధంకోసమని ప్రజలకు కావలసిన అవసరాలను సమకూర్చు కోకుండా మందుగుండు సామానుకోసం, పిస్తోలుకోసము డబ్బువృధా చేయడం న్యాయంకాదని నా ఉద్దేశ్యం. మనం ఇప్పుడు ఎటువంటి పరిస్థితిలో ఉన్నాము. ఎటువంటి పరిస్థితులలో 2 వ పంచవర్ష ప్రనాళికను ఏర్పాటు చేసుకొన్నాము అనేది ఒక్కసారి ఆలోచించుకోవలసిందని మన కమ్యూనిస్టు సోదరులకు మనవిచేయు చున్నాను 1947 వ సం॥లో మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆ సమయంలో హిందూ ముస్లిములకు ఒక పెద్దయుద్ధము జరిగినది. దేశంలో రక్తపాతం వ్యాపించి పోయింది. తరువాత పాకిస్థాన్‌నుంచి కోట్లకొలదిజనం ఇక్కడకు వచ్చినారు. వారందరికీ ఇళ్లు లేకపోతే మనం ఇళ్లు కట్టవలసివచ్చింది. వారి పిల్లలకు విద్యాసౌకర్య ములు కల్పించినాము. అప్పుడు సుమారు 1 కోటిమంది ప్రజలకు అన్నివిధములయిన

25th March 1956] [Sri M. Venkata Raju

సౌకర్యములు చేయవలసివచ్చినది. అందుకుగాను ప్రథమ పంచవర్ష ప్రణాళికలో 150 కోట్ల రూపాయలవరకు ఖర్చుచేశారు. మన దేశమును చాలా కాలంనుంచి బ్రిటిషువారు పాలించిన కారణంగా ప్రజలకు తిండికి, గుడ్డకు కరువు ఏర్పడింది. పంచదార, బండి పట్టాలు, ఎరువులు మున్నగునవి లేక పోయాయి. అటువంటి గడ్డు రోజులలో బెంగాలు దేశంలో కరువువచ్చినది. 30 లక్షలమంది జనులు చని పోయినారు. ఇటువంటి బాధాకరమైన రోజులలో మనకు స్వాతంత్ర్యం వచ్చింది. స్వాతంత్ర్యము సిద్ధించిన 4 సం॥ కే మనం పంచవర్ష ప్రణాళికలను అమలు పరచు కొనుట మొదలుపెట్టినాము. రష్యాదేశానికి 1917వ సం॥లో స్వాతంత్ర్యంవస్తే 1934 లో పంచవర్ష ప్రణాళికలను మొదలు పెట్టినారు. మనం భారత ప్రధాన మంత్రిగారి నాయకత్వాన స్వతంత్ర్యము వచ్చిన 4 ఏండ్ల కాలంలోనే పంచవర్ష ప్రణాళికలను మొదలు పెట్టగలిగినాము. మనకున్న కష్టాలను తొలగించుకున్నాము.

దాదాపుగా 27 లక్షల టన్నుల బియ్యాన్ని ఎక్కువగా పండించుకో గలిగి నాము. బట్టల కొరత తొలగిపోయింది. దాదాపుగా 500 కోట్ల గజాల గుడ్డ ఎక్కువగా తయారు చేసుకొంటున్నాము. అటులనే దాదాపు 160 కోట్ల గజాలవరకు చేనేత వస్త్రాలనుకూడా అభివృద్ధి చేసుకుంటున్నాము. ఇప్పుడు దాదాపు 50 కోట్ల గజాల గుడ్డను ఇతర దేశాలకు ఎగుమతి చేసుకొంటున్నాము. మొదటి పంచవర్ష ప్రణాళిక దిగ్విజయంగా సాగినది. రెండవ పంచవర్ష ప్రణాళిక కూడా దిగ్విజయంగా సాగగలదని చెప్పుటలో ఎట్టి అతిశయోక్తిలేదు. ఈ మధ్యన వినోబాభావేగారు ఉపన్యసించి నప్పుడు విద్యుచ్ఛక్తివల్ల మనకు బాధలేదు. ఇంకా ఉత్పత్తి చేయవలసియున్నది అన్నారు ప్రతి బీదవాని ఇంటియందుకూడా electricity వుండేటట్లు చూడవలసియున్నది. ఇప్పుడు రోడ్ల పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉన్నది.

అయినప్పటికీ దీనిని గురించి రాష్ట్ర ప్రభుత్వంవారు కృషిచేస్తున్నారు. ప్రతిపల్లెలోను ఉత్పత్తి అయ్యే ధాన్యం బయటకు రావాలంటే రహదారులు ముఖ్యంగా అవసరం. మన రాష్ట్రంలోని రహదార్లను గురించి ప్రణాళికలో 5 కోట్లకంటే ఎక్కువ కేటాయించలేదు. జిల్లా బోర్డులున్నాయని చెప్తున్నారు. జిల్లా బోర్డులు ఆర్థికంగా చాలా వెనుకబడి ఉన్నాయి. వాటివలన ఏమీ పనిజరిగే టట్లులేదు. గుంటూరు జిల్లాలో మొదలుపెట్టిన కార్యక్రమాలను పూర్తిచేయుటకు 30 లక్షల రూపాయలు కావాలి. ఇదే విధంగా అన్ని జిల్లాలలోనూ ఉంది. అయితే ఈ సమస్య ప్రతి గ్రామానికి సంబంధించినది కనుక అక్కడి ప్రజలు ప్రభుత్వంమీద వ్యతిరేక భావాన్ని చూపుతున్నారు. ఇతర పనులలో ఏ విధంగా

Sri M. Venkata Raju] [25th March 1956

అప్పు చేస్తున్నారో అట్లే 6 కోట్లో, 7 కోట్లో 20 సం॥లమీద అప్పుగా తీసుకొని జిల్లా బోర్డులకు ఇవ్వమని ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను కేంద్ర ప్రభుత్వం వారు అప్పుగా ఇచ్చిన ధనంతో మ్యునిసిపాలిటీలు నీటి వనర్లు ఏలా కన్పిస్తున్నారో ఆలాగె జిల్లా బోర్డులు ఈ ధనంతో రోడ్లను వేయిస్తారు. ఆ ధనమును ప్రభుత్వం వారు మళ్లీ 20 సం॥లలో తీసుకొనవచ్చును.

అందువల్ల చాలామంది ప్రజలకు మనం సహాయంచేసిన వారమవుతాము. ప్రజలు కూడ ప్రభుత్వం మంచిపనులుచేస్తున్నద నే వుద్దేశ్యంతో ఉంటారు. జిల్లాబోర్డులను కలెక్టరుగారి బాధ్యతమీద వదిలినట్లు ప్రభుత్వానికి సంబంధము లేనట్లు ఆయన special officer అయినట్లు భావం కనిపించుచున్నది. అది న్యాయంకాదు. ప్రతిపనికూడ ప్రజల యొక్క సహకారంవల్ల ప్రజలు "ఇదిమాది, మేముచేసుకోవాలి" అని గుర్తించేటట్లుచేయాలని N.E.S. Blocks లో చెప్పారు. ఎక్కడాకూడ ప్రజలు తమదని భావించుట లేదు. కలెక్టరుదో, తహశీల్దారిదో అనుకొంటున్నారు. ఈ N.E.S. Blocks కు వుండే కమిటీకి కలెక్టరుకు ఏమి సంబంధమో నాకు అర్థంకావడం లేదు. District Planning Committee కి కలెక్టరుకు సంబంధం ఉన్నది. అయినప్పటికి జిల్లాలో కలెక్టరును ఒక పెద్ద dictator వలె తయారుచేస్తున్నారు వారియొక్క mercy మీద development blocks అన్నికూడా ఆధారపడివున్నాయి. ఇంత నిరంకుశత్వం కలెక్టర్లకు పనికిరాదని, అన్ని అధికారాలు వారికి ఇవ్వడం న్యాయం కాదని District Advisory Boardsను వేయవలసిందని ఇదివరకే చాలమంది ఉపన్యాసాలలో చెప్పారు. ఉద్యోగస్థులలో ప్రజాప్రతినిధులము, ప్రజాసేవకులము అనే భావం ఉన్నప్పుడే ఈ plan నెరవేరుతుందిగాని ఇంకొక విధంగా నెరవేరదు. రష్యాలోను, చైనాలోను party office bearers-secretaries దగ్గర ఉండి party members చేత పనిచేయిస్తారు. అందువల్లనే వాళ్లపనులు సులువుగా పూర్తిఅవుతూ ఉంటాయి. 1942-43 సంవత్సరంలో కృష్ణాజిల్లా కొలవలో కమ్యూనిష్టులుదగ్గర ఉండి మట్టికూడా మోశారు. ఆవిధంగా చేస్తే ఎన్నోవేల మందితో చేయవలసిన పనిని వందలమంది మాత్రము చేయగలుగుతారు. రష్యాలోను, చైనాలోను ఎక్కువ పనులు కావడానికి కారణం ఇదే. ఇప్పుడుకూడా వాళ్లకు జీత బత్యాలు ఎక్కువగా అక్కరలేదు. ఒక కాలవను త్రవ్వవలసివస్తే చైనావారికి రష్యావారికిగాని P. W. D. Engineer తో అవసరంలేదు. 5 సంవత్సరాలు plan అక్కరలేదు మామూలు రైతులే దగ్గరఉండి రైతులచేత చాల అద్భుతంగా పనిచేయిస్తారు. ఎందువల్లనంటే unit కి 12 రూపాయలని లెక్కఉంటుంది. అందువల్ల ఏమి బాధలేదు. ఒక్కొక్కసారి 12 రూపాయలకు రెండు యూనిట్లు పనికూడా చేయిస్తారు. ఆవిధంగాచేస్తే 120 కోట్లు అయ్యే నందికొండ ప్రాజెక్టును

100 కోట్లు రూపాయలే ఖర్చు కావడానికి అవకాశం ఉంది. ప్రతివారితోను luxury వస్తువులను తగ్గించుకొని 1 రూపాయికి 1 కానిచొప్పున ఇస్తే బోలెడుడబ్బు అవుతుందని మంత్రిగారు చెపుతూ ఉంటారు. ప్రజలవిషయం అటుంచి ముందు ప్రభుత్వం తమ దుబారా ఖర్చులు తగ్గించుకోండని మనవిచేస్తున్నాను. Engineering department లో 100 కి 20, 25 చొప్పున మధ్య దళారులకు contractors కు దోపిడువాళ్లకు ఇవ్వకుండా మీకు అనుకూలమైనవాళ్లను స్కీములను నెరవేర్చాలనే పట్టుదల, ఉత్సాహంగలవారిని, మామూలురైతులను కాలనలమీద వేస్తే 12 రూపాయల unit కు 8 లేక 10 రూపాయలకే చేయిస్తారు. అప్పుడు 5 సంవత్సరాల తర్ఫీదు కానక్కరలేదు. B. E. pass కానక్కరలేదు.

N. E. S. blocks ఉన్నాయి. దానికి 7 లక్షల రూపాయలపైన ఇస్తున్నారు. అందులో 4 లక్షలు తక్కావీ loans క్రింద వసూలుచేస్తున్నారు. అయితే మాకు 7 లక్షలరూపాయలు ఖర్చు అవుతోందని చెప్పుతున్నారు. అలా కాకుండా ఆ block లో ఉండే భూమినిబట్టి ఖర్చు నిర్ణయించండి. మెట్ట తాలూకాలలో కొండప్రదేశాలలో రోడ్లకు ఎక్కువ ఖర్చుకాదు. ఇసుక ప్రాంతాలలో రోడ్లు సరిగా ఉండవు. అక్కడ కంకరరాయివేయాలి. అందువలన అక్కడ రోడ్లకు ఎక్కువ ఖర్చు అవుతుంది. దేశంలో ఒకొక్కక్కచోట తక్కావీ loans ఎక్కువ అవసరమవుతాయి. గుంటూరు కృష్ణాజిల్లాలో తక్కావీ ఋణాల అవసరం తక్కువ. అట్లాగే ఎక్కడ ఏది అవసరమో అక్కడ మనం ఇచ్చే డబ్బు ఖర్చు కావాలిగాని N. E. S. Blocks క్రింద ఇచ్చే 7 లక్షల 50 వేల రూపాయలలో 5 లక్షల 50 వేలు తక్కావీ loans అని, లక్షా 25 వేలు రోడ్లకని. లక్షా 25 వేలు buildings కు, ఖర్చుపెడుతున్నారు. అందువలన ఇటువంటి విషయంలో ప్రజా సంఘాలను, కమిటీలను ఏర్పరచి అందులో M. L. A లు సభ్యులుగాఉండి ప్రజా పద్ధతులప్రకారం వారంతాకలసి పనిచేయడానికి అవకాశం కలుగచేయవలసిందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI A. KALESWARA RAO:—అధ్యక్షమహాశయా, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మన ఎదుట ఉంచి కేంద్రప్రభుత్వమువారు ప్రజాభిప్రాయాన్ని తెలుసుకుంటున్నారు. నిపుణులచేత, అన్ని విషయాలు తెలిసిన వారిచేత చాల నైపుణ్యంతో తెలివితేటలతో, శ్రద్ధతో దేశాభిమానంతో ఒక గొప్ప ప్రణాళికను తయారుచేశారు. దానికేమి సందేహంలేదు. రష్యావిప్లవం 1917 సంవత్సరం అక్టోబరులో జరిగితే వాళ్ల మొదటి పంచవర్ష ప్రణాళిక లెనిన్ మరణానంతరం స్టాలిన్ మహాశయునిచే ప్రారంభించబడింది. ఆ తరువాత వాళ్లు అనేకమైన దేశాభివృద్ధి పథకాలను తయారుచేసుకొన్నారు. ప్రణాళికలంటూ ప్రారంభించినగౌరవం ప్రపంచమంతటికి బోల్షివిక్-

రష్యా కొక్కదానికే దక్కింది. వాళ్లొక పద్ధతిమీద పోతున్నారు. ఈ పంచవర్ష ప్రణాళికను గురించి మనం చాల డబ్బును ఖర్చుపెడుతున్నాము. ముఖ్యంగా గ్రామ అభివృద్ధి, వ్యవసాయ అభివృద్ధి, చిన్న పరిశ్రమలు పెద్ద పరిశ్రమలు వీటన్నిటినిగురించి ఎత్తుకోకముందు ప్రతిపక్షసభ్యులు ఒకరు defence ను గురించి, విమానాలగురించి, సైన్యాలగురించి, ఆకాశవాణినిగురించి, నాకాసైన్యాలు గురించి చెప్పలేదేమని అన్నారు. ఈ రోజులలో వీటినిగురించి డబ్బు ఖర్చుపెట్టడం దండుగ. రెండు హైడ్రోజన్ బాంబులున్నవాడు తాను నాశనమవుతాడు. ఇంకో కళ్లను నాశనం చేస్తాడు కాబట్టి ఈ విషయాన్నిగురించి ఆలోచించవలసిన అవసరంలేదు

ఆసలు మన "పంచశీల" ప్రకారం, గాంధితత్వంప్రకారం ప్రపంచంలోని జాతులమధ్య సోదరత్వం, సమానత్వము, స్వతంత్రము కలుగచేసి, శాంతిని సుస్థిరం చేసుకునేందుకు, యుద్ధాలురాకుండా ఉండేందుకు మనం ప్రయత్నంచేయవలసి ఉన్నది మనం defence పెంచుకొన్నందువల్ల ప్రయోజన మేమీలేదు వెంకటేశ్వర్లుగారిలాంటి వారెవరైన విప్లవము లేవదీస్తే సైన్యాలు అవసరమవుతాయి. కాని అటువంటి పని వాళ్లు చెయ్యలేదు.

SRI PILLALAMARRI VENKATEWARLU:—పంతులుగారు పత్రికలన్నీ చాల జాగ్రత్తగా చూస్తుంటూ రనుకొంటాను పాకిస్తాన్ ప్రమాదం గురించి నెహ్రూగారు, Defence Ministers చెపుతూ ఉంటారు. మాకోసమే ఏదో చేస్తున్నట్లు మాట్లాడుతున్నారు.

SRI. A. KALESWARA RAO:—పాకిస్తాన్ విషయం చాలా స్వల్పం. దానికోసం పెద్ద హైడ్రోజన్ బాంబులవరకు, అటంబాంబులవరకు పోనక్కరలేదు అది ఒక పెద్ద విషయము కానేకాదు. ఇప్పుడు ఉన్నటువంటి ప్రపంచముయొక్క నూతన దృక్పథంలో. అయితే, ఇప్పుడు ఆంధ్రప్రభుత్వము 116 కోట్లు irrigation కు గాను, 53 కోట్లు electricity కి గాను పెట్టినందుకు వారిని అభినందిస్తున్నాను మనకు కావలసింది irrigation. మన ఆంధ్రదేశము నదీమయమైనటువంటి దేశము. చాలా నదులున్నాయి. వాటికి ఆనకట్టలుకట్టి, అన్ని చోట్ల నీటిపారుదల సౌకర్యము కలుగజేసుకొని పల్లపు పైరులే కాకుండా మెట్ట పైరులుకూడా వేసి దేశాన్ని అంతటిని సశ్యశ్యామలంచేసే అవకాశం ఒక్క ఆంధ్ర దేశములోనే ఉన్నది. ఈ విషయములో విశాలాంధ్ర తక్కిన అన్ని ప్రాంతములకంటె చాలా ప్రముఖమైనస్థానాన్ని వహిస్తున్నది. దానికి తోడు, electricity కూడ ప్రతి మారుమూలకు, ప్రతిపల్లెకు, ప్రతిగుడిసెకు, అడవుల్లోకి కూడ తీసుకు వెళ్ళి ఇవ్వడానికి అవకాశమున్నది. ఈ రెండు విషయాలలోను, ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పటినుంచికూడ తగినంతశ్రద్ధ తీసుకోవడం జరుగుతున్నది. ఇకముందుకూడ

ఇదే శ్రద్ధ చూపించవలసియున్నది. అందువల్ల 116 కోట్లు irrigation కును 53 కోట్లు electricity కునూ కేటాయించినందుకు నేను ఆంధ్రప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. "Electricity means Socialism" అని Lenin చెప్పాడు. కాబట్టి దీనివల్ల సాంఘికసమానత్వం కలిసినటువంటి సమాజాన్ని సృష్టించకలుగుతాము. అది చాలా ముఖ్యమైనవిషయము. అయితే ఈపంచవర్ష ప్రణాళిక గురించి ఇంకొకవిధంగా ఒక ముఖ్యమైన విమర్శ ఉన్నది. అందులోను, నిన్న అదోనికి వెళ్లినప్పుడు అక్కడ సర్వోదయ సమాజంలో ఉన్నటువంటి నాయకులంతా చేసినటువంటి విమర్శ చాలా ముఖ్యమైనటువంటిది. గత శతాబ్దులో యూరపు ఖండములో వైజ్ఞానిక విప్లవం ప్రారంభమైంది. ప్రకృతి శాస్త్రాలన్ని అభివృద్ధి అయినాయి. ముందు ఉన్నటువంటి జమీందారీ పద్ధతి French విప్లవంతో నాశనం అయింది. కాని French విప్లవం తరువాత Industrial Revolution వచ్చింది. ప్రకృతి శాస్త్రాల అభివృద్ధి వల్ల పెద్ద పరిశ్రమలు ఏర్పడినాయి. పారిశ్రామిక యుగం వచ్చేసింది. దానిలో నుంచి సామ్రాజ్యతత్వము, సామ్రాజ్య-తత్వములో నుంచి యుద్ధాలు బయలుదేరినాయి. ఇదంతాకూడా French విప్లవం తరువాత పెద్ద పరిశ్రమలు ఏర్పడడంవల్ల వచ్చినటువంటిది. మొదట ప్రపంచ యుద్ధముయొక్క పరిణామంగా, అదివరకే ప్రారంభమైనటువంటి కార్మికుల తిరుగుబాటు ఫలితంగా 1917 అక్టోబరున ఒక ఆర్థిక విప్లవం జరిగింది. దానిలో Lenin మహాశయుడు, ప్రాముఖ్యత వహించాడు. తరువాత రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. ఈ రెండవ ప్రపంచ యుద్ధంలోనే India స్వాతంత్ర్యము పొందింది, గాంధి ప్రాముఖ్యత పొందాడు. కాబట్టి ఇప్పుడు మనము గాంధీ యుగంలో ఉన్నాము. గాంధీ తత్వం అనగా సర్వోదయము అన్నమాట. దీని ప్రకారం మనకు socialism రావాలి, ఆర్థిక సమానత్వం రావాలి. అంటే భాగ్యవంతునికి, బీదవానికి వీలైనంత తక్కువ భేదము ఉండాలి, దానికి మార్గాలు ఏమిటి ? రష్యాలో వాళ్లు ఒక మార్గం అవలంబించారు, అది కోట్లకొలది మనుష్యులను హింసించి చేయవలసి వచ్చింది. Lenin మహాశయుడు చాల గొప్పవాడు, నిజమే. అయినప్పటికి, అక్కడ భాగ్యవంతుల భూములన్ని లాగుకోవడంలో, ఆస్తులన్ని లాగుకోవడంలో, వారికి ఆస్తికి ఏవిధమైనటువంటి హక్కు లేకుండాచేసి యావత్తు ఆస్తిని ప్రభుత్వము వశపరచుకొనడంలో కాఠిన్యం వహించి, లక్షలకొలది, కోట్లకొలది ప్రజలను హింసించవలసి వచ్చింది. ఒక విధమైనటువంటి సామ్యవాద సమాజము నిర్మించినటువంటి మాట నిజమే. కాని అది మానవ స్వభావానికి విరుద్ధమవుతుందని ఎంచి కొంతలో, ఈ [illegible] వ్యక్తికి ఆస్తి కొంత ఇస్తున్నారు. కేవలం వ్యక్తికి ఆస్తి లేకుండా చేసేది పోయి, అతనికి ఒక గృహము, ఆ గృహములో కొన్ని పరికరాలు, పుస్తకాలు, [illegible], [illegible]
[illegible]

Sri A. Kaleswara Rao] [25th March 1956

పాటు వ్యవసాయం చేసుకొని అనుభవించడానికి కొంత ఆస్తి, దానికి వారసత్వము కూడ ఏర్పాటు చేయడం ఈవిధంగా మరల వారుకొంత వెనుకకు పోతున్నారు. మనము అటువంటిది చేయకుండా ఇదివరకు, పదివేల సంవత్సరములనుంచి ఉన్న భారత నాగరికతను, మన అనుభవాన్ని బట్టి, ప్రపంచములో జరిగినటువంటి అన్ని విప్లవములయొక్క అనుభవాలను, ఫ్రెంచి విప్లవముయొక్క అనుభవాన్ని రష్యా విప్లవముయొక్క అనుభవాన్ని యూరపు చరిత్రలోని అనుభవాన్ని, అన్నిఅనుభవాలు దృష్టిలో ఉంచుకొని చేస్తాము. మనమిప్పుడు గాంధి విప్లవము, అంటే సత్యము అహింసలతో కూడుకొన్నటువంటి విప్లవాన్ని సాగిస్తున్నాము. మనముకూడ సమానత్వము కోరుతున్నాము. దీనికి Villagism అంటే గ్రామాలను స్వయంపోషకం చేయడమనేది పునాదివంటిది. మనము రష్యాలోవలె వ్యక్తియొక్క ఆస్తులను లాగుకొని మరల ఆ పద్ధతినుంచి వెనుకకు పోయేవిధంగా చేయవలసిన పనిలేదు. మనకు పెద్ద భారీ పరిశ్రమలు అక్కరలేదు. దానివలన బస్తీలు పెరుగుతాయి. ఆ industries లో కూలి వాళ్లుగా మాత్రమే ప్రజలు పనిచేస్తారు. కనుక మనము అట్లు కాకుండా, చిన్న చిన్న ఆస్తులుగా చేసి ప్రతి ఒకరికి కొంత స్వంత ఆస్తి పెట్టి, వీలైనంతవరకు అందరికి సమానంగా వచ్చేటట్లుచేసి, హరిజనులు, కూలివాళ్లు, బీద వాళ్లు, రైతులు, అందరు ఏకమయ్యేటటువంటి Villagism ఏర్పాటు చేసుకోవాలి. దానికి మన Land reforms చాలా ముఖ్యము. వాటినుంచి మనము తప్పించుకోలేము. మనకు progressive land reforms కావాలి. ఇప్పుడు భూసంస్కారణ తప్పదు. గాంధి మరణించిన తరువాత ఒక మహా పురుషుడైనటువంటి వినోబా భావే బయలుదేరి భూదానము అడుగుతున్నాడు. దానివల్ల ఒక విప్లవము జరుగుతున్నది. మన గవర్నమెంటు, మన పార్టీలు ఇట్లు ఉండగా, వేలకొలది జనులందరి హృదయాలు కరిగిపోతున్నాయి కాబట్టి వినోబాభావే విప్లవముయొక్క పరిణామం చాలా దూరదృష్టితో జరుగుతున్నటువంటి విషయము. కనుక మనము భూసంస్కారణలు, ఆస్తి పంపకము చేయక తప్పదు. అయితే ఈ విషయంలో మనకు, కమ్యూనిస్టులకు భేదమున్నది. వాళ్ళ అహింసా సిద్ధాంతం మనకు అక్కరలేదు. వాళ్ల నాస్తికత్వము మనకు అక్కరలేదు. యావత్తూ ప్రభుత్వము క్రిందనే ఉండవలసిన అవసరంలేదు. వ్యక్తికి స్వాతంత్రము, వ్యక్తికి హక్కు, వ్యక్తికి వారసత్వం, ఇవన్నీకూడ ఉంచి మనము పనిచేస్తాము. మనము గాంధీ తత్వము ఒప్పుకోక తప్పదు. మనము ఏదో ఒక త్రోవలో పోవాలి. గనుక Lenin పద్ధతిలో పోదామా, గాంధి పద్ధతిలో పోదామా, లేక American capitalists పద్ధతిలో పోదామా ? మనకు capitalist system అక్కరలేదు, U.S.S.R. system అక్కరలేదు, కాబట్టి మనము గాంధి తత్వము మీదనే

పోవలసియున్నది. అది ఇప్పుడే తెలుసుకొంటే మంచిది. 1948 వ సంవత్సరం నుంచి ఇప్పటివరకు ఢిల్లీ ప్రభుత్వము చేసినటువంటి పొరబాట్లు ఏమిటి అంటే, గాంధిని నమ్ముకొని గాంధీ తత్వము మీద పోవడం మానివేసి ఏదో ఇంకా పాశ్చాత్యవ్యామోహాములో పడి అనేక విధాలుగా చేశారు. కాని ఇప్పుడప్పుడు కొంత ఈ మార్గములో ప్రయత్నం మాత్రం చేస్తున్నారు గాని అది పునాదిగా పెట్టుకోలేదు. ముఖ్యంగా irrigation, electricity, ఇంకా ఇతర development schemes వీటి విషయంలో ఎవరికి భేదాభిప్రాయాలులేవు ఉన్నటువంటి భేదాభిప్రాయమంతా industrial policy లో ఉన్నది. Heavy Industries కు, Basic Industries కు ప్రధానమైన స్థాన మిచ్చి machinery ఇక్కడ తయారుచేయించి, ఆ machinery వల్ల మరల కొత్త machinery తయారుచేయించి, పెద్దపెద్ద industries పెట్టి ఆ దోవనే పోతున్నారుగాని, ప్రధానంగా మనదేశము యావత్తు గ్రామాలతో నిండి ఉన్నది గనుకను, వ్యవసాయము ప్రజలయొక్క ప్రధానమైన వృత్తి గనుకను, ప్రజలకు ఇంకా ఎక్కువ నీటి పారుదల సౌకర్యాలు కలుగజేసి, రైతులకు ఇంకా ఎక్కువ fecilities ఇచ్చి, Co-operatitve Societies ఇంకా ఎక్కువ ఏర్పాటుచేసి గ్రామాలను ఎక్కువ అభివృద్ధిపరచి, ఆవిధంగా దేశ సౌభాగ్యాన్ని చేకూర్చేందుకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడంలేదు. పెద్దపెద్ద factories పెట్టినప్పుడు ఏమవుతుంది. అక్కడ బస్తీలు పెరుగుతాయి. పల్లెటూళ్లలో ఉన్నవాళ్లంతా అక్కడికి కూలీలుగా వస్తారు. కార్మికులకు యజమానులకు మధ్య వివాదాలు ఉంటాయి. ఎందుకంటే private sector కూడ ఉన్నది. 692 కోట్లు public sector అయితే heavy industries లో, 600 కోట్లు private sector కూడ ఉన్నది. అక్కడ ఈ ఆస్తులు, లాభాలు ఇవన్నీ natural గా managing directors కు పోతాయి. కనుక దీనివల్ల మన ఆశయము నెరవేరదు. ఇది ముఖ్యంగా గమనించవలసిందని కోరుచున్నాను. రెండవది ఆంధ్ర ప్రభుత్వపు ప్రణాళికలో గాని, Central Government ప్రణాళికలో గాని వైద్యము, ఆరోగ్యం క్రింద, దేశీయ వైద్యము గురించి ఎక్కడా ఏమీ చూపలేదు. ఆవిధంగా పాశ్చాత్య వ్యామోహంలో పడ్డాము. ఆయుర్వేదంగురించి చెప్పకుండా, ఏదో homeopathy, allopathy, ఇంకేదేదో చెప్పుతున్నారు. ఈ ఆయుర్వేదంగురించి చెప్పాలంటే, ఈ ఆయుర్వేదముతో కూడిన అమృత కలశ హస్తముతో ధన్వంతరి పాల సముద్రంనుంచి పుట్టాడని భాగవతంలో చెప్పబడింది. దయానంద సరస్వతి వ్రాసినట్లుగా ముందు బౌద్ధుల ఆశ్రమములలో విశ్వవిద్యాలయాల కాలములో అయితే చెప్పి తరువాత నలంద, తక్షశిల, అమరావతి, ఉజ్జయిని కాంచీపురం మొదలగు చోట్ల పెద్ద పెద్ద విశ్వ విద్యాలయాలు ఉన్న కాలములో అంతే చెప్పి [illegible] [illegible]

సంవత్సరముల నుంచి వస్తున్నటువంటి బ్రహ్మాండమైన Science ఈ ఆయుర్వేదము modern science కాదట. Modern medicine అని ఏదో కొత్తగావచ్చినదట. ఆయుర్వేదం విషయములో ప్రభుత్వముచేసింది యేమీలేదు. ఆయుర్వేద కళాశాలలు పెట్టించండిఅని అడిగితే, అవి పెట్టించకుండా, 'మేము శాసనాలు చేస్తాము, అందరికీ అర్హులయిస్తాము, నీవు వైద్యము చేసుకో' అని చెబితే, అది ఏ విధంగాను లాభము లేదు. దానివల్ల ఎవరూ తృప్తిపడరు. మనమందరము గాంధీయతత్వం మన భారతీయ తత్వంగా ఎట్లో పరిగణించుచున్నామో, అట్లాగే ఆయుర్వేదము కూడా అటువంటిదే. దానికి ప్రభుత్వము ప్రతేకంగా కళాశాలలు ఏర్పాటుచేయాలి.

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు కళాశాలలు పెట్టిన అన్నిచోట్లలోనూ bush coats వేసుకుని, stethoscope మెడలో వేసుకుని సూదులు పట్టుకుని షైటకు వచ్చేవారందరూ వాళ్లే. కాని ఆయుర్వేదము ఎక్కడనూ కన్పించడములేదు.

SRI. A. KALESWARA RAO :— అట్లా అయితే, ఆయుర్వేదములో మాకు నమ్మకములేదని స్పష్టముగా చెప్పండి. అంతేకాని, అవి పెట్టుతాము, యివి పెట్టుతాము అని మాత్రము చెప్పకండి. మాకు యీ ఆయుర్వేదముమీద నమ్మకములేదు, మాకు విదేశవైద్యముమీదనే నమ్మకము ఉన్నది. మాకు యీ థర్మామీటరుయందు, stethoscope యందే నమ్మకము ఉన్నది. ఈ alopathic medicine యీ modern science, యీ స్ట్రెప్టోమైసిన్ మీదనే నమ్మకము ఉన్నది. ఇవి అన్నీ ఏ అమెరికానుంచో, ఏ విదేశాలనుంచో, దిగుమతి అయినవి, మేము వీటినే ఉపయోగించుతాము అని స్పష్టముగా చెప్పండి. అవిధముగా చెబితే, అప్పుడు నేను ఒప్పుకుంటాను. ఇక మీద ప్రతిసారి ఆయుర్వేద పెట్టించండి అని కళాశాల మేము అడగము. ఈ విషయము యింకా ఎవరైనా చెప్పవలసిన విషయమేమో కాని, వెంకట్రావుగారు చెప్పవలసిన విషయముకాదు.

ఇక family planning విషయమునుగురించి నేను ఒక్కమాట చెప్పి విరమిస్తాను అసలు యీ family planning అంటేనే, నాకు కొత్తగా యిష్టములేదు. మన దేశములో మంచి పతివ్రతాధర్మము అనేది ఉంటూ ఉన్నది. శీలము, మంచినీతి నియమములుగల స్త్రీలు ఉంటున్నారు. ఏమీ తెలియని అమాయక స్త్రీలకు ఈ కొత్త పద్ధతులు అన్నీ నేర్పి, వాళ్లయొక్క పాతివ్రత్యానికి, సుగుణ సంపదకు, భక్తికి, ఇంద్రియ నిగ్రహానికి, దమం, శమం, యివి అన్నీగూడ ఉండే అడవాళ్లకు, గొడ్డలిపెట్టుగా, కేవలం

భోగలాల సత్వం నేర్పి, మంచి సుగుణములుగల ఆడవాళ్లను యీ నూతన పద్ధతుల ద్వారా చెడగొట్టడము తప్ప మరేమి కాదు. Family planning, అని వాళ్లకు లేనిపోని పద్ధతులు నేర్పడమువల్ల వాళ్లకు గర్భస్రావాలో, యింకా ఏదో విధంగా జబ్బు: రావటమో జరుగుతున్నది, ఈ పద్ధతులు నేర్చుకోటానికి, ఏ contraceptive medicines తినటమో, యింకా ఏవో తోళ్లు పెట్టుకోవడమో (laughter) యిటువంటివి అన్నీ వచ్చేటప్పటికి, అందరు స్త్రీలు నేర్చుకుని సంఘము బొత్తిగా చెడిపోవటానికి దారితీస్తున్నవి. నిజముగా మన దేశములో ఆధ్యాత్మికపునాదులు నాశనము అవుతాయి కాబట్టి, యీ family planning కు సంఘము protest, దానితోగూడా నా protest తెలియజేస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా

ఇప్పుడు కాళేశ్వరరావుగారు, contraceptives ను గురించి, తోళ్లు పెట్టుకోవడము గురించి చెప్పారే, ఆ మాటలు అన్నీ రికార్డు అవుతాయేమో, అవి యీ సభయొక్క గౌరవానికి భంగమేమో, ఆమాటలను తొలగించితే బాగుంటుదేమో, ఆలోచిస్తారా ?

Mri SPEAKER:—Why ? There is nothing wrong about it. They are all being use now.

Sri P. SATYANARAYANA :—అధ్యక్షా, ఈ నాడు భారత దేశానికి ఏదైనా ఒక బ్రహ్మాండమైన సమస్యఉన్నదా, అంటే, యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలుపరచుకోవడము ఒకటే. దీనిని గురించి మా: పార్టీ వైఖరి అంతా సుందరయ్యగారు విపులముగా చెప్పనే చెప్పారు ఈ ప్రణాళికలో 1960 వ సంవత్సరము నాటికి మనకు సోషలిస్టు ప్రాథమిక సూత్రాని కనుగుణముగా ఉంచేటట్లు ఉన్నదా అంటే, public sector తగినంత అభివృద్ధికాదు. అప్పటికికూడ నూటికి తొంభై పాళ్లు private sector ఉండి పోతుంది. కొంతవరకు control ఉంటే ఉండవచ్చు. అయినప్పటికినీ యీ విధమైన బలహీనత కొంతవరకు ఉన్నప్పటికినీకూడ, మేము మాత్రము యీ విషయములో పూర్తిగా సహకరిస్తాము. అందుకు మాకేమి అభ్యంతరములేదని ఆయనే చెప్పారు. ఇది వస్తుతః అభ్యుదయకరమైనటువంటి ఒక plan చైనాలో చరిత్రాత్మకంగా ఏ విధమైన పరిస్థితులువచ్చినవో ఆ పరిస్థితులు మన భారత దేశానికి రాలేదు. కనుక [illegible] మనయొక్క మార్గము కొంచెము భిన్నముగ వుండక తప్పదు. [illegible] అమలుపరచడములో మనకు రెండు మార్గాలు కనుపిస్తూవున్నవి : (1) [illegible] plan ను, అమలు పరచడంలో [illegible] అభివృద్ధి [illegible]

మనము యీ plan ను అమలు పరుచుకోలేము. అట్లా చేయలేకపోతే మాత్రము యీ ప్లాను కాగితముమీదనే ఉండిపోతుంది. అడుగుఅడుగునా అభివృద్ధి నిరోధక శక్తులు జయముపొందుతూ వారు ముందుకు పోతారు. ముందుకుపోయి చివరికి మొదటి పంచవర్ష ప్రణాళికలో ఏ విధమైన అపజయాలను మనము పొంది యున్నామో ప్రాథమిక విషయాలలోనే చాలా భాగము అదేరకమైన అపజయాలను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోకూడ మనము పొందవలసివస్తుంది. ఇప్పుడు ప్రతి పక్షము కోరేది యేమంటే, కేవలము యీ plan అంతాకూడ మరల రచించండి. అని చెప్పడము లేదుగాని, యిప్పుడు ఉన్న ప్లానును మాత్రము అక్షరాల అమలు పరచడములో ఉండే యిబ్బందులను, అనుసరించవలసిన మార్గాలను చూపుతూఉన్నది. వ్యవసాయక రంగము మనము చూచుకుంటే, భూస్వామిక విధానము, అనగా Landlordism చాలా ప్రతిబంధకముగా ఉన్నది పారిశ్రామిక రంగముచూస్తే, పెట్టుబడిదార్లకు అంతులేని దాహము కన్పిస్తున్నది. ఇది ఒక అవరోధముగా ఉంటున్నది. ప్రభుత్వ రంగములోచూస్తే యీ రెండు అభివృద్ధి నిరోధక శక్తులకు ప్రబలమైన పలుకుబడి ఉంటున్నది. ఈ మూడుకూడ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలు పరచడములో రాగల ప్రతిబంధకాలు అని చెప్పవలసియున్నది. మొదటి పంచవర్ష ప్రణాళికను అమలు పరచడములో Indian Union level లో మనకు అనేక విధములుగా వైరుధ్యాలు కన్పిస్తూ వచ్చినవి. ఒక వైపున మనకు అనేక వైరుధ్యాలుగా యివి ఉంటున్నప్పుడు, మనకు Capital formation లేదు. పెట్టుబడులు లేవు. ఆ కారణముచేత మనము పెట్టుకో వలసినవన్ని పెట్టుకోలేక పోతున్నాము. అని చెబుతూ, మరొక వైపున సుమారు ఒక వెయ్యికోట్ల రూపాయలదాకా బ్రిటిషు పెట్టుబడిదార్లది మనదేశములోనే ఉంటే, మనయొక్క sterling balances ఎనిమిదివందలకోట్ల రూపాయలు మనకు రావలసిఉంటే, కనీసము economic adjustment చేస్తూ, ఆ పరిశ్రమలు అన్ని Nationalise చేస్తే, కొంతమట్టుకు capital formation ఏర్పడుతుంది. అటువంటివైఖరి అవలంభించటానికి కేంద్రప్రభుత్వము నిరాకరిస్తున్నది. ఇదిగాక మరొక పెద్ద పరిశ్రమగుత్త స్వభావాన్ని వహించి, చిన్న పరిశ్రమలను వృద్ధికి రాకుండా నాశనముచేయడము అవుతున్నది. దీనివల్ల దేశములో నిరుద్యోగము పెరగడము, ఆర్థికవ్యవస్థ చిందరవందర కావడము జరుగుచున్నది. ఈ విషయములో Planning Commission ఒకవిధమైన వైఖరిని తీసుకున్నది. ఆ వైఖరిని T. T. Krishnamachari గారు ప్రకటించిన తరువాత దానికి వ్యతిరేకముగా, ఆ వైఖరి సరిలేదని నందాగారు ఖండించారు. మరల దానిమీద శ్రీ టి. టి. కృష్ణ మాచారిగారు బొంబాయికివచ్చి, నందాగారు చెప్పినది ఖండించారు. ఈ రకముగా కేంద్రములో పరస్పర వైరుధ్యాలు ఉన్నవని వైటికి తెలుస్తున్నది. Labour కు

సంబంధించినంతవరకూ ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలుజరిగిన అయిదు సంవత్సరముల కాలములో అనేక శాసనములు చెయబడ్డవి. కాని అందులో ఒక్కటిగూడ అమలు జరగక పోవడమే కాకుండా, అసలు ఆ శాసనములుకూడ చాలా భాగము లోప భూయిష్టముగాఉన్నవి. అనేక పర్యాయములు Labour demand మీద చర్చ జరిగినప్పుడు యీ విషయాలు చాలామటుకు చర్చించబడినవి. కాని యిప్పుడు ఆ వివరాలలోనికి వెళ్లడము అనవసరము. అందుచేత మనకు ఒక రకమైన ద్వంద్వాలు కన్పిస్తున్నది. ఒకవైపున 'Insurance companies ను nationalise చేశాము. Imperial Bank ను nationalise చేశాము, public sector ను సృష్టించబోతున్నాము, ఇంకా ఏవేవో చేస్తున్నామని' చెబుతూన్నప్పటికినీ మరొకవైపున, యిప్పుడు నేను మనవిచేసిన అభివృద్ధి నిరోధకశక్తులు తమ కార్యక్రమమును జరుపుకుంటూవస్తూన్నప్పుడు ఈలాంటివిఅన్ని ఎంతో దారుణముగా State level కు వచ్చేటప్పటికల్లా, అభివృద్ధి నిరోధకమైన కార్యక్రమాలు యింకా కొంత ఎక్కువగా ముందుకు పోవడము జరుగుతుంది.

జమీందారీ సిస్టమును మనం రద్దుచేసుకున్నాం కాని పేదరైతాంగానికి రాబడి హెచ్చి, వ్యవసాయకూలీకి wages పెరిగి వారి నిత్యజీవితంలో అభ్యుదయకరమైనటువంటి, చెప్పుకోదగినటువంటి మార్పు ఏమైనావచ్చిందాఅంటే లేదని చెప్పాలి. జమీందారీ విధానం రద్దుకావడం అభ్యుదయకరమే కాని దానివల్ల పేద ప్రజల జీవితంలో ఏవిధమైనటువంటి మార్పు రాకపోవడం దురదృష్టకరం. ఇది ఒక రకమైనటువంటి ద్వంద్వం. మనచేతిలోకొన్ని అధికారాలున్నాయి. రెండు కోట్లమంది ప్రజలమీద రకరకాలైనటువంటి పన్నులు, సుమారు 100 రకాలైన పన్నులు వేసేఅధికారం మనకుఉన్నది. ఇది ఒక పటుతరమైన ఆయుధంగా ఉపయోగించుకుని అసమానతలను లేకుండా చేయడానికి వీలున్నది. దీన్ని ఏవిధంగానైనా మనం ఉపయోగించామా ? లేదు. పన్నులు, వేయండలో principle of gradation పాటించి, ఇచ్చుకోగలిగినవారికి ఎక్కువ పన్నువేసి, ఇచ్చుకోలేని వాళ్ళను పన్నునుండి రద్దుచేసి, మధ్యతరగతులమీద తక్కువపన్నువేసి ఈ రకంగా చేస్తే చాలా బాగుండేది. అల్లాచేశామా ? లేదు. భూములనుండి కౌలుదార్లను వెళ్ళగొట్టవద్దని ఎలుగెత్తి నెహ్రూగారు చాటినాకూడా ఇంతవరకూ మనంవిన్నామా? వినలేదు. 0-8-6 కంటె ఎక్కువవడ్డీ తీసుకోకూడదని చాలా రోజులక్రిందట చేసిన శాసనం నాటికి రెండుపాళ్లయినా అమలు జరుగుతోందా ? లేదు. ఇక గ్రామాలు చూద్దామా, అక్కడ దారుణమైన, చెప్పడానికి అలవికానంత దోపిడి జరుగుతోంది. నేటికికూడా నూటికి 60 పాళ్లకంటె ఎక్కువగా వివ్చిరుంచాలతో కొల్లతలు జరుగుతున్నాయి. అంటే వ్యవసాయకూలీలకు ఇచ్చేటటువంటి కూలీలు

Sri P. Satyanarayana] [25th March 1956

ఈ పిచ్చికోలతలతో ఇస్తున్నారు. ఆ కూలీ తనకు ఒకరూపాయిఅప్పు కావలిస్తే ఒక ఇత్తడిచెంబు తాకట్టుపెట్టాలి.

Sri T. V. RAGHAVULU :—On a point of information, Sir ! పిచ్చికుంచాలని కూలీలకు తెలిసిఉన్నంతకాలం, వారు దానికి ఇష్టపడే పని చేసినప్పుడు ఇందులోదగా ఏమిఉంది ? దాన్నిగురించి కొంచెం మనవిచేయవలసిందిగా కోరుతున్నాను.

MR. SPEAKER :—I want to make a suggestion. Instead of going on with the criticism of the present day conditions of life, economic, political, fiscal, dynamics and other things let us confine ourselves to the Plan and make some concrete suggestions, or show the weak points therein. Otherwise there will be no end if the House is to go on criticising conditions ; ofcourse our conditions are bad, and there is no gainsaying about it. But let us have some suggestions, let us try to show some suggestions. If we can propose some changes in the Plan, I think that would be doing some useful work. The little time I am allowing any one member is hardly enough to talk on any one point of our persent day activities.

SRI P. SATYANARAYANA :—అధ్యక్షా ! పిచ్చికుంచాలని తెలిసినా, అతనికి ఉన్న ఆర్థిక ఇబ్బందులవల్ల తిరస్కరించలేడు. రెండో పంచవర్ష ప్రణాళిక యొక్క యోగ్యతను ఇప్పుడు చర్చించవలసిన అవసరంలేదు. అన్ని పార్టీల వెనుకవుండే ప్రజానీకం హర్షించినటువంటి plan. ఐనా వచ్చిన చిక్కేమిటంటే plan లన్ని కాగితంమీదే ఉండిపోతున్నాయి. అమలుజరిపే విధానంలోనే ఉన్నది సమస్య. ఒక రూపాయి ఇందులోనుంచి అందులో పెట్టడంవల్ల గాని మరొక రూపాయి అందులోనుంచి ఇందులోకి మార్చడంవల్ల గాని, దీనివల్ల వచ్చేటటువంటి పెద్దప్రయోజనం అంతగా ఏమీలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలో కొన్ని allotments విషయంలో నిన్న planning మంత్రిగారు చెబుతూ దానిలో ఉన్న బలహీనతలు వివరిస్తూ అందులో ఒకటి, నిరుద్యోగం పెరిగిందన్నారు. రెండవది కొన్ని allot చేసిన మొత్తాలు పూర్తిగా ఖర్చుపెట్టుకోలేకపోయినాం అని చెప్పారు. దీనివల్ల మనం గ్రహించగల్గిందేమంటే మొదటి పంచవర్ష ప్రణాళికలో నూటికి 11 వంతులుమాత్రమే జాతీయ ఆదాయం పెంచుకోగలమని ఆశించినది. 18 వంతులవరకూ పెంచుకున్నాం. జాతీయ ఆదాయం బాగా పెరిగింది. పార్టీ

శ్రామిక అభివృద్ధిలో 30 వంతులుమాత్రమే సాధించగలుగుతాం అని ఆశించినది 100 కి 40 దాటి సాధించాం. ఉత్పత్తి ఎక్కువయింది. జాతీయఆదాయం పెరిగింది. దాని పర్యవసానం ఏమిటంటే, మళ్ళీ ప్లానింగుమంత్రిగారి మాటల లోనే చెప్పాలంటే, ప్రక్కనే నిరుద్యోగంకూడా దారుణంగా పెరిగింది. ఈ జాతీయ ఆదాయం పెరగకముందు ఎంత నిరుద్యోగము ఉందో పెరిగినతర్వాత అంతకంటే ఎక్కువ నిరుద్యోగం వున్నది. దీనివల్ల plan లో లోపం కనిపించడం లేదు. Plan ని అమలుపరిచే విధానంలోనే వున్నది. ప్రభుత్వంలో అభివృద్ధి నిరోధకుల యొక్క ప్రాబల్యం పలుకుబడి చాలా విపరీతంగా యున్నది. రెండో పంచవర్ష ప్రణాళికయొక్క పునాదులు కాని, దానిలో నిర్ణయించిన targets కాని, private రంగానికీ public రంగానికీ ఉండేటటువంటి సంబంధాలలో భేదాభిప్రాయాలు ఏమీలేవు. దాన్ని సరిగా అమలుజరిపితే చాలా అభివృద్ధికి రాగలం. దానిలో వ్యవసాయిక programme అమలుజరిపినా గ్రామీణ వ్యవస్థ అంతా అభివృద్ధికి వస్తుంది. ఈ విషయం ప్రజానీకమంతా అంగీకరించింది. కాని అధికారంలో ఉండేవారియొక్క ప్రాబల్యంవల్ల దానికి కొన్నితూట్లు పడడానికి సావకాశం ఉంది కనుక అన్నిపార్టీల వెనుకవుండే అభ్యుదయ కాముకులంతా చాలా శ్రద్ధగా జాగ్రతగా ఆలోచించి, అక్కడ వుండే అభివృద్ధి నిరోధకశక్తులతో అడుగడుగునాకూడా పోరాడి దాన్ని అమలు పఱచడానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను.

Sri V. KURMAYYA :—అధ్యక్షా, రెండవ పంచవర్ష ప్రణాళికభారత దేశానికంతకు గొప్ప ఆదర్శాలతోను ప్రజలందరిని దృష్టిలో పెట్టుకుని తయారుచేయబడింది స్వాతంత్రం ఎటువంటి పరిస్థితులలో వచ్చిందో మనకు తెలుసును. ఒక రక్తపుబొట్టు చిందకుండామహాత్మాగాంధీగారి నాయకత్వంక్రింద స్వాతంత్రం సంపాదించుకొన్న నాలుగు సంవత్సరాలలోపులోనే మొదటి పంచవర్ష ప్రణాళికను దేశంలో వేసుకొని అమలుపర్చిరి ప్రజలకు సేవచేయడానికి రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం ఎంతోకృషిచేసినవి. మన పుత్సల సత్యనారాయణగారు మాట్లాడుతూ అభివృద్ధి నిరోధకులున్నారని చెప్పారు. అభివృద్ధి నిరోధకులు ప్రతి పార్టీలోను ప్రతి దేశంలోను ఉండడం సహజమే. వారిని ఎదిరించి ఏవిధంగా లొంగుబాటులోనికి తీసుకు రావాలనేది, అభివృద్ధి నిరోధకశక్తులు మన మార్గానికి అడ్డురాకుండా చేసుకోవడమే కాంగ్రెసు ప్రభుత్వముల policy. పంచశీల ద్వారా భారత ప్రధానిగారు ప్రపంచానికి ఒక గొప్ప సందేశాన్ని పంపించి చాలా దేశాలను ఆహ్లాదింపచేశారు. దీనిని బట్టి మన దేశచరిత్ర విశాలంగా

అర్థం కాగలదు. బుద్ధుడు భారతదేశంనుంచి శాంతి సందేశాన్ని ప్రపంచానికి తీసుకువెళ్లారు. అటువంటి దేశంనుంచి నెహ్రూగారు అపరబుద్ధుడు మాదిరిగా పంచశీల ప్రపంచానికి తీసుకువెళ్లి సహజీవనాన్ని, ఒక దేశం మరొకదేశంపై యుద్ధం చేయకుండా ఉండేపద్ధతిని భారతదేశాన్ని ప్రపంచంలో ఆదర్శప్రాయంగా చేయిడానికి ఆయన కృషిచేస్తున్నారు ఆరు పంచవర్ష ప్రణాళికలు అయిన తరువాతకూడా రష్యాలో అడుక్కొని తినేవాళ్లున్నారని కుమారప్పగారు చెప్పారు. ఎన్నోతరాలనుంచి, కులాలతోను మతాలతోను అనేక sections తోనుఉన్న భారతదేశాన్ని ఒక రాజరికంనుంచి తీసుకువచ్చి ప్రజలను ప్రేమతో persuasion ద్వారా అందరికి సుఖంకలుగజేయాలని ఉద్దేశంతో ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు తయారుచేయబడినాయి. నిన్న మన మంత్రిగారు చెప్పుతూ సుందరయ్యగారు చెయ్యి అనిచెప్పి నిర్బంధంతో చేయిస్తున్నారు; గాంధిగారి సిద్ధాంతం ప్రకారం బతిమాలుతూ ప్రేమతో చేయించాలని ఉద్దేశం; ప్రేమ, సత్యం, అహింస అనేవి భారతదేశ ఋషి సాంప్రదాయాలు; ధర్మాలు, ఈ ధర్మాన్ని, అనుసరించి ప్రేమతోను persuasion ద్వారా మనంచేయించగలమా లేదా అనే సందేహం ఇంగ్లీషు చదువులు చదివినవారికి, నవనాగరికత గలవారికి ఉండవచ్చును. మన సాంప్రదాయానికి సంబంధించినంతవరకు అది సత్యమని నమ్ముతున్నాను. టి. టి. కృష్ణమాచారిగారు, నందాగారు తలొక విధంగా చెప్పారు. ఇకముందు అభివృద్ధి నిరోధకులకు స్థానంఉండదు. అస్పృశ్యతా నివారణకై భారతదేశంలో మహాత్మాగాంధిగారి నాయకత్వం క్రింద స్వాతంత్రం ఏర్పడిన తరువాత అస్పృశ్యతా నివారణకై చట్టముచేసి అస్పృశ్యతను నేరంగా పరిగణించినప్పుడు తరతరాలుగా వచ్చిన భావాలను మార్చుకుని హరిజనులను ఈరోజున దగ్గరకు రానిస్తున్నారా లేదా? కుగ్రామాలలో కూడా మార్పువచ్చినదా లేదా అని కమ్యూనిస్టుపార్టీ వారిని అడుగుతున్నాను. ప్రేమవల్ల దేనినైనా సాధించవచ్చును. విరోధమువల్ల పాలు త్రాగించలేము కాని స్నేహంవల్ల ప్రేమవల్ల విషముకూడా త్రాగించవచ్చును. ద్వితీయ పంచవర్షప్రణాళిక చాలా బాగున్నదికాని అభివృద్ధినిరోధకులు తూట్లుపెట్టడానికి ప్రయత్నిస్తారనే సంకోచం ఎవరికీ ఉండనవసరంలేదు. భేదాభిప్రాయాలతో చాలారోజులనుంచి వస్తున్నాం కాబట్టి వాటిని సర్దుకుంటూపోతున్నాము. Adult franchise ఇచ్చాము కాబట్టి రానురాను ప్రజాప్రతినిధులు వస్తారు. కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలో ఉన్నందున ఎవరో కొంతమంది వచ్చారు అనుకోవచ్చును. Adult franchise ఇచ్చినతరువాత, అడుక్కుతినేవానికి వోటు ఉన్నది కాబట్టి వీరందరు ప్రతినిధులనుకునేరోజున ఈ ప్రణాళికను ఎవరూ నిరోధించడానికి వీలు ఉండదు. దేశంలో మార్పు రావాలి. విద్యావిధానం తీసుకుంటే కేవలం గుమాస్తాలను తయారుచేసే

విద్యమాత్రమే కాకుండా భుక్తికి ముక్తికి వీలుగా ఉండేవిధంగా basic పాఠ శాలలు పెట్టుకుంటున్నాము. వృత్తివిద్యలను నేర్పుతున్నాము. ఇది నేర్చుకొని పెద్దవారైనతరువాత ఇది చేస్తే తప్పు అని అనుకోడం పోతుంది. నెహ్రూగారి నాయకత్వంక్రింద మార్పు తీసుకురావడానికి ప్రయత్నం జరుగుతుంది. ఇప్పుడు పంచవర్ష ప్రణాళిక క్రింద అభివృద్ధికరమైన విషయాలు జరుగుతున్నాయి. చదువుకున్న వారికికూడా మనప్రభుత్వం రు. 4800 కోట్లు ఏవిధంగా సంపాదించి ఈ ప్రణాళికను తయారుచేసి దేశాన్ని ముందుకు తీసుకుపోతోందో సామాన్యంగా ఆశ్చర్యంగా ఉంటుంది. హిందూదేశం చాలా భాగ్యవంతమైన దేశం.

ప్రజలు బీదవారు అయినా హిందూదేశంలో అనేకమైన resources ఉన్నాయి. ప్రభుత్వంవారు భూమిలోని ఖనిజాలను బయటకుతీసి ఫ్యాక్టరీలు పెట్టాలి అనుకుంటున్నారు. సింద్రీఫాక్టరీ, విమానాలఫాక్టరీ మొదలయినవి పెట్టి నిరుద్యోగసమస్య తీర్చడానికి ప్రజలకందరకు తిండి కలుగచేయడానికి అవకాశాలు ప్రణాళికలో ఉన్నాయి. నెహ్రూగారు నాలుగు సంవత్సరాలలోపుగా దేశంలో తిండి కొరత ఉండకూడదు అన్నారు. అనేకమైన మార్గాలు కనిపెట్టి ప్రాజెక్టులు కట్టి tractors తెచ్చి వ్యవసాయంలో ముందుకు తీసుకువచ్చి భోజనంలో deficit తీసివేసి సమృద్ధికరమైన భోజనాన్ని కలుగచేశారు. వ్యవసాయం అభివృద్ధిలోనికి పోతోంది. Tractors తీసుకువచ్చి అనేకరాష్ట్రాలలో బంజరులు బీదవాళ్లకు hill tribes కు సౌఖ్యం కలుగచేయడానికి plans అనేకవిధాలుగా తయారు చేశారు. Industries విషయంలో సిమెంటు, పంచదార ముఖ్యంగా కావాలి. వీటికోసం క్రొత్తగా factories రాబోతున్నాయి. ప్రభుత్వమునకు శక్తి లేక పోతే private sector కు permision ఇచ్చి దానిని control చేస్తూ దేశ సంపదకు ఉపయోగించేట్లు చేయాలని ఆలోచిస్తున్నారు. Fisheries Department ను తీసుకోండి. Coastal line మనకు చాలా ఉన్నది, అగ్నికుల క్షత్రియులకు Mechanised Boats ఇచ్చి fishing అభివృద్ధిలోనికి తీసుకువచ్చి ప్రజలకు తగిన పుష్టికరమైన ఆహారాన్ని సమకూర్చడానికి ప్లానులో తయారు చేశారు. గ్రామోద్ధరణకై గ్రామసేవకులను అనేకమందిని తయారుచేస్తున్నారు. ప్రస్తుతం ఉద్యోగస్థులు అధికారరూపంలో పనిచేస్తారుకాని ప్రేమరూపంలో పని చేయరని Village level workers ను ప్రత్యేకం తయారుచేస్తున్నారు. Scheduled casts, tribal communities కు సంఘాలు పెట్టారు. దీనికి 90 కోట్ల రూపాయలు రెండవ పంచవర్షప్రణాళికలో వేశారు. ఇవేకాకుండా womens welfare department పెట్టారు. బీదప్రజలకు ఏ విధంగా సేవ చెయ్యాలో, ఏ విధంగా voluntary organisations ఉన్నప్పుడు [illegible]

Sri V. Kurmayya] [25th March 1956

చెయ్యాలో దేశాన్ని సస్యశ్యామలంగా సమృద్ధిగాచేయడానికి ఏ స్కీములు కావాలో ప్రణాళికలో పెట్టారు.

ఏ దేశమైనా అభివృద్ధికావాలంటే, దారిద్ర్యం క్రమేణాపోవాలి. రష్యాలో ఉన్నటువంటి సిద్ధాంతం ప్రకారమో, చైనాసిద్ధాంతం ప్రకారమో భాగ్యవంతుల, జమీందారుల భూమి పంచిపెట్టలేము. ఆ సిద్ధాంత, సాంప్రదాయములతో మన హిందూదేశానికి ప్రమేయమే లేదు. మహాత్మాగాంధి అందుచేతనే ప్రేమ సిద్ధాంతంతోనే ఆర్థికసమానత్వాన్ని సంపాదించాలని అట్టి సిద్ధాంతాలను అమలు పరచాలని చెప్పారు ఇటువంటి రెండు మూడు పంచవర్ష ప్రణాళికలు వేసుకొని దేశంలో దారిద్ర్యము, రోగాలు లేకుండా చేయటానికి ప్రయత్నం చేస్తున్నాము. నిజంగా Public health విషయంలో అన్నిచోట్ల hospitals కట్టి వాటిని వృద్ధిచేయడమే కాకుండా, Health centres, maternity centres పెట్టారు. వానికోసం 8 కోట్ల రూపాయలకుపైగా మన రాష్ట్రానికి అభివృద్ధి ప్రణాళికలక్రిందే తీసుకొనివచ్చారు. ఇవన్నీకూడా క్రమేణా కావాలి. దేశంలో ఎక్కువ రోగాలున్నమాట వాస్తవమే. ఆ రోగాలను తీసివేయడానికి మనకుతగినంతమంది డాక్టర్లుకావాలి. తగినంతమంది డాక్టర్లు ఉన్నప్పుడు వారిక్రింద పనిచేయడానికి తగినంతమంది నర్సులు కావాలి. వారితోబాటు పనిచేయడానికి Mid-wives కూడా కావాలి. దీనికొరకే 8 కోట్లకుపైగా పథకాలు వేసుకొన్నారు. ముఖ్యంగా రెండవ పంచవర్ష ప్రణాళికలో గ్రామం పునాదిగా తీసుకొన్నారు. పైనుంచి రాకుండా ఈ దేశంలోని 5 లక్షల గ్రామాలను అక్కడ గ్రామకమిటీలను, District planning కమిటీలతోను సంప్రదించి ఒక ప్లానును తయారుచేశారు. కాని ఇక్కడ ఒక చిన్నవిషయంమాత్రం నేను ప్రభుత్వానికి మనవి చేయదలచుకొన్నాను. అదేమిటంటే గ్రామాన్ని Centre ను ప్రాతిపదికగాను తీసుకొన్నప్పుడు ఆ గ్రామంలోని మాలపల్లెను, మాదిగపల్లెను దృష్టిలోకి తీసుకోలేదు. Contribution అనే సిద్ధాంతంవల్ల పల్లెలలోనుంచి contribution యిచ్చేవారెవరూ రాలేదు అందుచేత ఈ contribution ఉన్నా లేకపోయినా, Public health విషయములోను, sanitation విషయములోను హరిజనవాడ, లేకపోతే చిన్నగ్రామాలున్నప్పుడు దాన్నికూడా గ్రామాలుగా తీసుకొనివెళ్లాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. లేకపోతే మాలపల్లెలు అంతాకూడా అశుద్ధంగా ఉంటాయి. రోగాలన్నీకూడా అక్కడనుంచి బయలుదేరి గ్రామాల్లోకి రావటానికి అవకాశంఉందిగనుక ప్రభుత్వ ఉద్యోగులకు తగిన instructions ఇచ్చి రోగాలను నివారణ చేయించాలని నేను planning మంత్రిగారికి సలహాఇస్తున్నాను. తరువాత National water supply schemeకు గాను కోటిరూపాయలు మాత్రమే కేటాయించారు. దేశమంతాకూడా గ్రామా

లతో నిండిఉన్నది. 100 కి 75 మంది గ్రామాల్లోనే నివసిస్తున్నారు ఆ ప్రజలందరికి 1 కోటిరూపాయలను మంచి నీటికొఱకై మంజూరుచేసినారంటె అది చాలా తక్కువ మొత్తం అని చెప్పవలసియుంటుంది. పట్టణాలకు 2 కోట్లకు స్కీము తయారుచేశారు. గ్రామాలకు కనీసం మనం మంచినీళ్లయినా ఇవ్వాలి మన ప్లానుప్రకారంగా మంచి భోజనం, వస్త్రాలు ఇవ్వాలనుకున్నాం. నివాస యోగ్యమైన ఇండ్లు కావాలి. అటువంటప్పుడు మంచినీళ్లుకూడా ఇవ్వాలి. కనుక Revised budget తీసుకువచ్చేటప్పుడైనా ప్రభుత్వంవారు గ్రామాలను దృష్టిలో పెట్టుకోవాలని కోరుతున్నాను. ఇటువంటి పంచవర్ష ప్రణాళికలవల్ల మన భారత దేశం ప్రపంచంలోకెల్లా ఆదర్శంగా ఉంటుంది. అట్టి ఆదర్శాలకు మూలపురుషుడు అయిన మహాత్మాగాంధీగారి పేరు పంచశీలను, శాంతి సందేశాన్ని ప్రపంచానికి అందజేసిన జవహరులాలు పేరు చిరస్థాయిగా ఉండడమే కాకుండా, ఆయన ఆదర్శాన్ని ముఖ్యంగా రష్యా మున్నగు దేశాలు తీసుకొంటాయనికూడా నేను అనుకొంటూ ఇంతటితో సెలవుతీసుకొంటున్నాను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా! ఈనాడు మనం రెండవ పంచవర్ష ప్రణాళికను చర్చించుకోవడమే కాకుండా, ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను అమలుపరచే భాగ్యం మన శాసనసభకు ఉండడమంటె మనం చాలా అదృష్టవంతులమని నేను భావిస్తున్నాను. ముఖ్యంగా ఈ సందర్భంలో, మొదటి పంచవర్ష ప్రణాళిక 100 కి 100 పాళ్లు జయముపొందిందని ప్రతిఒక్కరమూ సగర్వంగా చెప్పుకోవలసిన అవుసరం వుంది. రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో మొదటి పంచవర్ష ప్రణాళికకంటే మన గ్రామాల అభివృద్ధికిని, ఇంకా వ్యవసాయం మొదలైనవాటిల్లో ఎక్కువశ్రద్ధ తీసుకోవటం జరుగుతున్నందుకు చాలా సంతోషం. 4,800 కోట్లరూపాయలలో మనకువచ్చినభాగంమాత్రం చాలాతక్కువఅయినందుకు నేను కొంచెం విచారిస్తున్నాను. మొదటి పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రదేశమునకు రావలసిన కోటా రాలేదు. మనము అనుకున్నంత అభివృద్ధి పొందటానికి అవకాశం లేకపోయింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత రెండవ పంచవర్ష ప్రణాళికలో మనం కొంచెం ఎక్కువగా ఖర్చుపెట్టుకోవటానికి అవకాశముంటుందని అందరితో సరిసమానంగా వృద్ధిపొందడానికి అవకాశం వుంటుందని ఆశించినాము. కానీ రెండవ పంచవర్ష ప్రణాళికలో మనకు కొంచెం తక్కువ మొత్తం ఉన్నందుకు విచారము వెల్లడిస్తూ ఢిల్లీ ప్రభుత్వం కొత్తగా ఏర్పడిన ఈ రాష్ట్రం విషయములో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలని నేను కోరుతున్నాను. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో భారీ పరిశ్రమలు—factories ఆంధ్ర రాష్ట్రంలో ఏర్పాటుచేస్తే చాలా ఉపయోగంగా ఉంటుందని నేను భావిస్తున్నాను. మన కళా వెంకట్రావుగారు చెప్పినట్లుగా విశాఖపట్టణంలో భారీ విద్యుచ్ఛక్తి స్థ

Sri L Lakshmana Das] [25th March 1956

కరాల కర్మాగారము, steel Fabricating Plant, Coal mines survey చేయించడం, ఎరువులఫ్యాక్టరీ ఒకటి, నిర్మించడమే కాకుండా కొత్తగూడెంనుండి Waltair వరకు కొత్త రైల్వేలైను వేయటంవల్ల నూతనంగా ఏర్పడనున్న విశాలాంధ్రలో హైదరాబాదునుంచి ఉత్తర సర్కారులకు పోయే మార్గము చాలా దగ్గర అవటమే కాకుండా, రవణాసౌకర్యాలు ఓడరేవుకు సమీపంగా చేసుకోవటానికి అవకాశముంటుంది కావున ఆ రైల్వేలైనుకూడా ఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను. అదే విధంగా నంద్యాలనుంచి పీలేరుకు, తరువాతను శ్రీకాకుళం జిల్లాలో 100 సంవత్సరములనుంచి వెనుకబడియున్న పర్లాకిమిడి లైటు రైల్వేని పెద్దలైనుగా ఏర్పాటుచేసి అటు పార్వతీపూరు లైనును చేర్పించిన చాల బాగుంటుందని నేను అనుకొంటున్నాను. ఢిల్లీప్రభుత్వం ఖర్చుపెట్టుతున్న 2586 కోట్ల రూపాయలనుంచి ఆంధ్ర ప్రభుత్వానికి 4( కోట్ల రూపాయలుమాత్రం గ్రాంటుగాను 80 కోట్లు loan గా రావడమంటె ఇది చాలా తక్కువమొత్తమని మనవి చేస్తున్నాను. ఈ విషయంలో కూడా ఢిల్లిప్రభుత్వం మనకు ఎక్కువమొత్తాన్ని కేటాయిస్తుందని నేను ఆశిస్తున్నాను కానీ మనము ఈనాడు మన రాష్ట్రమును అభివృద్ధి చేసుకోవటంలో మనము అనేక క్లిష్ట పరిస్థితులలో ఆర్థిక ఇబ్బందులలో ఉన్నా చాలా ముందుకుపోతున్నామని ప్రతిఒక్కరూ గర్వించాలి. కమ్యూనిస్టు సోదరులు కొందరు మనదేశము అభివృద్ధి పొందలేదు, పొందడానికి అవకాశం లేకపోతోంది అంటున్నారు. చైనాలో జరిగింది, రష్యాలో జరిగింది అంటే అక్కడి ప్రభుత్వాలువేరు ఇక్కడ మనము ప్రజాస్వామికంగా ప్రతి ఒక్కరినీకూడా ఒప్పించి వారియొక్క హృదయాభిమానాన్ని చూరగొని పరిపాలన చేసుకొంటున్న దేశంలో ఆ మాదిరిగా అభివృద్ధి పొందటం చాలా కష్టమైనవిషయం అని వారు గమనించాలని చెప్పుతున్నాను తరువాత ఈ విషయంలో అభివృద్ధినిరోధకులు దేశంలో వున్నారు, వారివిషయంలో శ్రద్ధ తీసుకోవాలని వారు హెచ్చరిక చేస్తున్నారు. అభివృద్ధి నిరోధకులవిషయంలో నేమి ఎవరివిషయంలో గాని భారతదేశం మన ప్రాత సాంప్రదాయాలను, మనకున్న చరిత్రనుబట్టి మనం క్షమించే దేశమిది. అదేవిధంగా నిజంగా అభివృద్ధినిరోధకుల పైన చర్య భారతప్రభుత్వం తీసుకోదలచుకుంటే స్వాతంత్ర సమరంలో భారత దేశ స్వాతంత్రానికే ఆటంకం చేసినవారిని ఏమిచేసివుండాలో, చేసివుందురు. కానీ అటువంటి వుద్దేశం, భారత ప్రభుత్వానికిగాని, భారత నాయకులకుగాని లేదు. ప్రపంచంలో శాంతి కావాలని శాంతిమూలాన్నే అభివృద్ధి పొందాలనే కోరిక. మన భారతనాయకులయొక్క ఈ ప్రణాళికలు ఎంత ప్రజాసహకారముతో, ప్రజాసామ్యంతో ఎలా ముందుకుపోతున్నదీ చూచి ప్రతి ఒక్క భారతీయుడును గర్వించాలి. ప్రజలలో ఉన్న ఈ నైతికశక్తిద్వారా భారతదేశం ఎంత అభివృద్ధి పొందుతుంద నే విషయంలో మనమందరమూ గర్వించాల్సి నేను మనవిచేస్తున్నాను.

తరువాత ప్రతి ఒక్కరూ మాట్లాడినప్పుడు land reforms ప్రత్యేకంగా ఒక slogan మాదిరిగా మాట్లాడుతున్నారు. కాని వ్యవసాయము, పరిశ్రమలు ఏ విధంగా భారత దేశంలోఉన్నవి ? వీటివల్ల దేశానికి ఎంత లాభదాయకంగా ఉన్నది ? ఇతర దేశములతో సరిసమానంగా పోల్చి చూసినప్పుడు మన దేశంలో ఉన్న కష్టసుఖాలు ఏమిటి అనేది గమనించకుండా ప్రతి ఒక్కరూ వ్యవసాయాన్ని ముక్కలు ముక్కలుగా చేయాలి, భూములు ముక్కలు ముక్కలుగా చేయాలి అని చెబుతున్నారు. తప్పకుండా చేయవలసినదే, కాని ఎప్పుడు చేయాలి ? నిజముగా భారత దేశానికి వ్యవసాయక పారిశ్రామికం లాభదాయకం అని చెప్పుకున్ననాడు మనం చేయడానికి అవకాశం ఉంటుంది కాని యీ నాడు దేశంలో వ్యవసాయం ఎంత వరకు లాభదాయకం అని లెక్కలు తీసుకుంటే యితర వృత్తులతో సరిసమానంగా చూసుకుంటే 1% వడ్డికూడా కిట్టదని పూర్తిగా వ్యవసాయంలో అనుభవం ఉన్న వారికి తెలుసును. ఐతే వ్యవసాయం విషయంలో ఒక కుటుంబానికి ఎంత ఉండాలో వారు చెప్పారు. 1600 రూపాయల రాబడివచ్చే భూమికి 3 రెట్లు ఉంచి తక్కిన భూములు పంచిపెట్టమన్నారు. నేను ఒకటి అడుగుతున్నాను. దేశంలోనున్న యితర రాబడిదార్లు యితర వృత్తులలో ఉన్నవారు యింతకంటే హెచ్చు లాభాలు పొందుతున్నట్టి వారి దగ్గర తీసుకోడానికి అందరూ సిద్ధంగా ఉన్నామా అని అడుగుతున్నాను. అలాంటప్పుడు వ్యవసాయదారులుకూడా సిద్ధంగా ఉంటారు. ఎటువంటి అభ్యంతరాలు పెట్టరు. కాని వ్యవసాయానికి కావలసిన ప్రధానమైన సమస్యలు నేడున్నవి. దేశంలో యీనాడు వ్యవసాయం అభివృద్ధి చెందడానికి అవకాశాలున్నవా అన్న విషయాలు జాగ్రత్తగా చూసుకోవాలి. వ్యవసాయమునకు కావలసిన 5 ప్రధానమైన విషయాలలో మనం శ్రద్ధ తీసుకోవాలి. ఎంత భూమి ఉంటే తాను తన జీవనోపాధికి పోగా కుటుంబానికి యింత రాబడి వస్తుందని స్వయంగా చెప్పుకుంటే అవకాశం ఆనాడు వుంటుంది. అప్పుడే మనం అభివృద్ధి చెందడానికి అవకాశాలుంటాయి. మొట్టమొదట నీటి సరఫరా విషయంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటున్నది. ఇంకా చాలా తీసుకోవలసిని అవసరంవున్నది. దానికి 5 ఏండ్లో 10 ఏండ్లో పట్టవచ్చు. వెంటనే చేయమని నేను చెప్పలేను. ఎందుకంటే దేశంలో ఉన్న ధనాన్నిబట్టి ప్రణాళికలు తయారు చేసుకుంటాం కాని Magic Wand తో ధనాన్ని సంపాదించే అవకాశాలులేవు. రెండోది వ్యవసాయానికి కావలసిన credit విషయంలో ప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళికలో చాలా తక్కువ మొత్తం కేటాయించిందని నేను భావిస్తున్నాను. Co-operation కు 150 కోట్ల రూపాయల మాత్రం రెండవ పంచవర్ష ప్రణాళికలో ఏర్పాటు చేసింది. 150 కోట్ల రూపాయలు చాలవు. ఒక్క ఆంధ్ర దేశంలో మన వ్యవసాయదారులకు కవిస్తే

Sri L. Lakshmana Das] [25th March 1956

తమకు కావలసిన ఖర్చుల క్రింద రమారమి 90 కోట్లు రూపాయలు కావలసిఉన్నది. Credit facility లేకపోవడంవల్ల వ్యవసాయ వృత్తికి చాల దెబ్బగా ఉన్నది. అదే విధంగా వ్యవసాయదారునకు కావలసిన rate, పంట యింతతక్కువ రేటు లేకుండా నేను అమ్ముతాను అనే అవకాశం లేదు. అందుచేత water supply, credit facilities, marketting facility, crop insurance, యీ 5 సూత్రాలు అమలుపరచిన తరువాత కుటుంబానికి 10 ఎకరాలనో 15 ఎకరాలనో, 20 ఎకరాలనో, 30 ఎకరాలనో, మనం సమగ్రంగా నిర్ణయం చేసుకోవచ్చు అట్టి నిర్ణయానికి తప్పక అందరూ అంగీకరిస్తారని నేను ఆశిస్తున్నాను. అందుచేత నే యీ facilities గురించి మనం జాగ్రత్తగా చూడాలి. కేంద్ర ప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళికలో credit facilities విషయంలో హెచ్చు శ్రద్ధ తీసుకోవాలని నేను భావిస్తున్నాను. తరువాత ఆంధ్ర దేశానికి సంబంధించినంతవరకు యీ Second Plan లో medical, Health విషయాలలో చాలా తక్కువ మొత్తాలున్నాయి అవి చాలవు. గ్రామాలలో ఆరోగ్యం విషయమై ఎంతో యిబ్బంది పడుతున్నారని అందరికీ తెలుసును. మూల ధనం తక్కువ కావడంచేత మనకు రావలసిన Quota తగ్గిందని సెలవిచ్చారు. అది బహుశః Delhi ప్రభుత్వం అభిప్రాయం అయి ఉండవచ్చు. కాని మనకు డబ్బు తక్కువ అనే విషయంలో మనం ఏ మాత్రం నిరుత్సాహం పొందనవసరంలేదు. మనకు కావలసిన ధనం సంపాదించుకునే అవకాశాలున్నాయి. ఇంకా హెచ్చు సంపాదించుకోవాలంటే మన రాష్ట్రంలో ఉన్న మహిళలు ముఖ్యంగా అమ్మన్నరాజాగారు పూనుకుని స్త్రీల దగ్గరున్న dead capital బంగారాన్ని ఒకసారి దేశంముందుకు తీసుకువచ్చినట్లయితే కావలసిన ధనం కాక యితరులకు అప్పులు యిచ్చే అవకాశాలున్నాయి. అందుచేత డబ్బులేదనే లోటులేదు. ఆ డబ్బు సంపాదించుకోడం సులువైన మార్గం. ఈ 5 ఏండ్లూ స్త్రీలందరూ భారతదేశంయొక్క సౌభాగ్యం కొరకు తమ ఆభరణాల నర్పించి అప్పుయిస్తే చాలు. భారతదేశం అనుకున్నదానికంటె మరింత వేగంగా అభివృద్ధి చెందుతుందని ఆశిస్తున్నాను. ఈ విషయంలో స్త్రీలు వెనుకకు తీయరని భావిస్తున్నాను. నిన్న వెంకట్రావుగారు appeal చేస్తూ యీ ప్రణాళిక విషయంలో శాసన సభ్యులు సహకరించాలి, దీని నందరూ support చేయాలన్నారు. నిజముగా అది మన కర్తవ్యం. మన ధర్మంకూడా. ఈనాడు దీనిని చర్చించడమే కాకుండా అమలుపరచి మార్గదర్శకంగా ఉండడానికి కూర్చున్నాం. అందుచేత ప్రతి శాసన సభ్యునికి బాధ్యత యివ్వాలని వెంకట్రావుగారిని కోరుతున్నాను. మీరు యీ అభివృద్ధి ప్రణాళికలలో Community Block లను ఏర్పాటు చేస్తున్నారు. అందుకు సంతోషమే. కాని ఏర్పాటుచేయని ప్రదేశాలలో ఒక్కొక్క area కు కొంత మొత్తాన్ని allot చేసి ఒక్కొక్క శాసనసభ్యుడు ఎంతవరకు తాను ఖర్చుపెట్టగలడు తన

SRI M. NAGI REDDI :—గౌరవసభ్యులదగ్గర safety razor ఉన్నదండి ?

SRI P. KODANDARAMAYYA :—నేనేదో పన్నెండేండ్ల బాల కుమారుడు కాబోతారా అని అడిగారు. నేను గడ్డముచేసుకోకపోతే సభ్యులు అందరూ నన్ను చూచి నవ్వుతారని యిప్పుడు బ్లేడును ఉపయోగిస్తున్నాను.

[At this stage Mr. Speaker resumed the Chair.]

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గురించి చర్చించేటప్పుడు, దానియొక్క లక్ష్యాలు యేమిటి అని దృష్టికిలో పెట్టుకుని చర్చించవలసి యున్నది. ఈ ప్రణాళికయొక్క చరమ లక్ష్యంవల్ల దేశము సర్వతోముఖాభివృద్ధితో పురోగమించ బోతుందని పెద్దలు చెప్పారు. అంటే ఈ ప్రణాళికవల్ల దేశములోని ప్రతి మానవునికిన్నీ తినటానికి తిండి, కట్టటానికి గుడ్డ, ఉండటానికి యిల్లుకలిగి, వైద్యవిద్య సౌకర్యాలు కలిగి భారత జాతిని సరిసమానంగా ముందుకు పోయేటట్లు అవకాశము కలుగుతుందని అనుకోవచ్చు. కాని యీనాడు ఉన్నటువంటి పరిస్థితులనుబట్టి సంఘము తనయొక్క అవసరాలను సరిచేసుకుంటుందా అనేది యీ ప్రణాళికద్వారా మనము చర్చించవలసి యున్నది. ముఖ్యంగా సంఘము అన్నివిధములలో కూడ అభివృద్ధికి రావాలంటే, దేశానికి ఆయువుపట్టు, పునాది ఏది అని మనము తెలుసుకోవలసి యున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళికద్వారా పైనుంచి క్రిందికి అనగా మనము పెద్ద పెద్ద ప్రాజెక్టులు పునరావాస సౌకర్యాలు కలుగజేసుకుని ఉన్నాము. ఇక ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ద్వారా క్రిందినుంచి పైకి అనగా ముందు గ్రామాభివృద్ధినుంచి ఆరంభము చేసి, పైకి అభివృద్ధిచేసుకుంటూ రావాలని అనుకున్నాము.

ఈనాడు మన భారతదేశంలో ఈ పంచవర్ష ప్రణాళికలను అమలుపరచే విషయంలో మన పూర్వ సంస్కృతిని విస్మరింపరాదు. ఆధునిక నాగరికతా ప్రపంచంతో మనం చేతులుకలిపి నడవవలసి యున్నప్పటికీ మన జాతి యొక్క పూర్వాచార సాంప్రదాయాలనుగాని, పూర్వాచార పద్ధతులనుగాని అనుకరిస్తూ, ఏవైనా కొన్ని మార్పులు కావలసియుంటే, అని చేసుకుంటూపోతే మన జాతిని సరియైన పంథాలో అభివృద్ధికర మార్గాలలో నడిపిస్తున్నాం అనుకోవచ్చును గాని ఏదో ఈనాడు పాశ్చాత్య నాగరికతా మోహంలో పడిపోతున్నాం అని సంతసింపరాదు. అన్ని విధాలా విద్యలోగాని, వైద్యంలోగాని వారుముందుగా పోతున్నారని, వారు నాగరికతలో మనకంటె అభివృద్ధికరంగా ఉన్నారని భావింపరాదు. వారిని అనుకరించడం మన జాతిని అగౌరవపరచడం అవుతుంది మన పూర్వసాంప్రదాయాలను అగౌరవపఱచి నట్లవు

తుందని నేను భావిస్తున్నాను. మన జాతియొక్క పూర్వ ఔన్నత్యం మన సంఘంలో స్త్రీలకు ఉండే గౌరవంమీద ఆధారపడి ఉండేది. అంటే స్త్రీల పాతివ్రత్య రక్షణకు మానసంరక్షణకు మనజాతి ఇచ్చిన గౌరవం పవిత్రత మరి ఏ జాతీ ఇవ్వలేదేమోనని నా నమ్మకం. ఆ నాడు స్త్రీల మానరక్షణకై ప్రాణాలర్పించిన మహాధీరులున్నారు. స్త్రీలకిచ్చిన గౌరవం చేతనే భూమినికూడా భూమాత అన్నారు. ప్రకృతినికూడా మాతఅన్నారు ఈ సృష్టికి కారణం శక్తిఅన్నారు. కాని పురుషునికి ప్రధాన స్థానం ఇవ్వలేదు మన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో స్త్రీల సంక్షేమాన్ని గురించి, స్త్రీల గౌరవ ప్రపత్తులను రక్షించే విషయాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ వహించకపోవడం శోచనీయం. స్త్రీలను సంక్షేమ శాఖలో వేశారు గాని, పతితలైనటువంటి స్త్రీలను రక్షించుటకై ఏమీ చర్యలు తీసుకోలేదు. అన్న వస్త్రాదుల లోపంచే విధిలేక వ్యభిచార వృత్తికి దిగినటువంటి స్త్రీల రక్షణకై ఏ విధమైనటువంటి వసతీ ఇందులో కల్పించనందులకు నాకు చాలా చింతగా ఉన్నది. వారు చేసినటువంటి నైతిక దుశ్చర్యకు శిక్షవేయడమే జరుగుతోంది కాని, శిక్ష అనుభవించి చెరసాల వెలువడివచ్చిన తరువాత వాళ్లు బ్రతికే మార్గమేమి అనే దాన్ని గురించి ఎవరూ విచారించుటలేదు. మొదటనే అన్న వస్త్రాదుల లోపంచే అటువంటి దుశ్చర్యకు గడంగినప్పుడు మరల ఏ విధమైన జీవితమార్గం లేకుండా ఈ విశాల ప్రపంచంలో వారిని తిరిగి వదలిపెట్టినట్లయితే, అదే వృత్తి గాక మరి ఏ వృత్తికి పోగలరు. మన దేశ గౌరవం, జాతి గౌరవం కాపాడుకోవాలంటే ఈ విషయమై రెండవ పంచవర్ష ప్రణాళికలో ఎంత డబ్బు ఖర్చుచేసి నప్పటికీ తప్పులేదు. ఈ విషయంలో ఇంత నిరాదరణకూడదని ఘంటా పథంగా తెలియజేస్తున్నాను. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమలక్ష్యం నిరుద్యోగ సమస్యా పరిష్కారం అన్నారు. అంటే ఏమో నాకర్థం కావడంలేదు. నిరుద్యోగం అంటే వీళ్లైనా గవర్నమెంటు ఉద్యోగం లేకుండా ఉండడమనా అర్థం. అదే నిజమైతే యంత్రంలో ఉత్పత్తి చేసినట్లు ప్రతి సంవత్సరం School Final పరీక్షలో ఉత్తీర్ణులైనవారి list పెద్ద మహా భారత మంత తయారవుతున్నది గదా, వీళ్ళందరకూ ఎన్నడు ఉద్యోగం చూపించడం జరుగుతుంది ? ఇది సాధ్యమా ? అందరూ ఉద్యోగస్థులైతే అందరూ సన్యాసులైతే, సన్యాసులూ, సన్యాసులూ రాచుకుంటే బూడిద రాలినట్లు ఉంటుంది. ఏ విధమైన వృత్తి ఉండదు. ఈ నిరుద్యోగ సమస్యా పరిష్కారం అనేది, ఈ పంచవర్ష ప్రణాళికా లక్ష్యంగా పెట్టినందువల్లనే, అది ప్రణాళికకు ఒక దెబ్బ లాగకూడా ఉంది. ఈ Community Projects కు కేటాయించినటువంటి అనేక కోట్ల రూపాయలలో సగానికి పైగా ఉద్యోగస్థులకై ఖర్చవుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక [illegible] సాగింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఇంకా అమోఘంగా విజయవంత మవ్వ

Sri B. Rama Reddi] [25th March 1956

తుందని మనం చెప్పుకుంటే, మనం ఉద్యోగస్థులనూ, గుమాస్తాలనూ సృష్టించడం తప్ప దేశాభివృద్ధికై కేటాయించిన ధనం మనం సద్వినియోగం చేసుకోలేకుండా పోతున్నాం. నిరుద్యోగ సమస్యను పోగొట్టాలి అంటే వృత్తి ధర్మాలను పాటించే టటువంటి వృత్తి విద్యలను విద్యాలయాలలో బోధించాలి. విద్య గవర్నమెంటు ఉద్యోగాల కొఱకే అనే భావంలేకుండా వృత్తి ధర్మాలకు మర్యాద ఇచ్చి వాటిని నేర్చుకునేవిధానంగా ఉండాలి. మనదేశంలో అనేక వృత్తులున్నాయి. కమ్మరి, కుమ్మరి, వడ్ల, చర్మకార మొదలగు వృత్తులున్నాయికదా. వారి వారికి అనుగుణ్యమైన వృత్తులను ప్రాథమిక పాఠశాల దశనుంచి వారికి నేర్పి, ఈ వృత్తి విద్య అనేది అగౌరవం అనే దృష్టి లేకుండా చెయ్యాలి. మన బిడ్డలందరూ చదువుతున్నారుగదా School Final pass ఐనదగ్గరనుంచి రైతుబిడ్డయినట్లయితే ఎద్దులదగ్గర కొచ్చుచూచినా, పేడచూచినా అసహ్యంమనుకుని అది ముట్టుకుంటే నీచంగా భావించి అగౌరవంగా భావించేస్థితిలోకి వచ్చారు. విద్య విద్యకొఱకే చదువుకుంటాను, నేను రైతుబిడ్డను, నా వృత్తియొక్క ప్రాణాన్ని మానాన్ని రక్షించే ఎద్దురగ్గరకుపోయి దాని పేడతీస్తే నాకు గౌరవలోపంకాదు, అనే భావం కలగాలి. అది నా గౌరవానికీ శ్రేయస్కరమైనదనే భావాన్ని కల్గించేవ్యక్తి విద్య లను ప్రాథమిక విద్యదగ్గరనుంచి నేర్పించే పద్ధతి పెట్టిననాడే ఈ పంచవర్ష ప్రణాళిక వల్ల నిరుద్యోగసమస్య నివారణవుతుందికాని, కేవలం గవర్నమెంటు ఉద్యోగాలు ఇచ్చినందువల్లనే ఎన్నటికి పరిష్కారంకాదు. సంవత్సరం, సంవత్సరం కొన్ని లక్షల జనాభా పెరుగుతోంది. సంవత్సరానికి పదిలక్షలమందికి ఉద్యోగాలు చూపించాలన్నారు. ఇది సాధ్యమయ్యే పనికాదు. పూర్వకాలంలో రాజులు చతుషష్టి కళలకూ ప్రాధాన్యం, ఇచ్చి పోషించేవారు. నాట్య, నాటక, శిల్ప, సాంస్కృతిక మొదలైన సాహిత్యకళలన్నిటికీ ప్రాధాన్యం ఇచ్చి కవులనూ, గాయకులనూ, శిల్పులనూ, ప్రభుత్వమే ఆదరించి ప్రోత్సహించేవారు. పంచవర్ష ప్రణాళికలో గొప్పదైన నాట్యకళకు ఎక్కడాస్థానం ఇవ్వలేదు. అది ప్రచారా నికికూడా వినియోగించవచ్చును. ఈ బుఱ్ఱకథలూ, హరికథలూ వీటిలో ఎంతో సాహిత్యం ఉంది. సరియైన అభివృద్ధికర నాటకాలు వ్రాయించి ప్రభుత్వమే కళా శాలలుపెట్టి అందులో తరిఫీతుఇచ్చి, ఈ ప్రచారశాఖగా వారిని ఉపయోగించి నట్లయితే, లలిత కళలలో ప్రఖ్యాతులైన వారికి కొంత ఉదరపోషణ జరుగుతుంది ఈవిషయమై శ్రద్ధవహించి నాటకకళను ప్రోత్సహించాలని మంత్రిగారిని కోరు తున్నాను. మన పల్లెలను గురించి కోదండరామయ్యగారు ఆవేశంతో చెప్పారు. నిజమే. ఐతే సంఘం ముందుకుపోయిన కొద్ది సంఘంతో పోవలెనేగాని మనం మొగసుకు కూర్చొని బ్లవుజ్ తొడుక్కోకూడదు, boot లు తొడుక్కోకూడదంటే

దానివల్ల సంఘం నాశనంకాదు. నైతికంగా బాగుపడనప్పుడు సంఘం పాడయి పోతుందికాని, neat గా ఉన్నందువల్ల, boot లు తొడుగుకున్నందువల్లా, సంఘం చెడిపోదు. ఆనాటి గురుకులపద్ధతితోనే Christians అంతా convent schools పెడుతున్నారు. ఒకవిధమైన నైతిక ఒత్తిడి తీసుకువచ్చి విద్యార్థుల భావి జీవితాన్ని సరియైన పంథాలో పెట్టడానికి గొప్ప అవకాశం కల్పిస్తున్నారు. మన ప్రాథమిక పాఠశాలలోగాని, Middle Schools, High Schools లో గాని, కాలేజీలలోగాని వినయవిధేయతలంటే ఏమో, నైతికజీవనం విలువ ఏమో నేర్చుకున్న పాపాన్ని పిల్లవాళ్లూపోరు, నేర్పినపాపాన్ని అయ్యవార్లుపోరు. విచ్చలవిడి, స్వైరవృత్తి, వాళ్లదో liberty అనుకుని ఏమోచెబుతున్నారు కాని అక్కడ లభించేది liberty కాదు. అందువల్ల విద్యావిధానంలో ఒకవిధమైన నైతిక నిర్బంధంవుండి మన పూర్వసాంప్రదాయాలను గౌరవించే గురుకులాలుగా మన విద్యాసంస్థలు తయారైనప్పుడే మనపిల్లలు బాగుపడతారుగాని లేకపోతే విచ్చలవిడి అలవాటై మనం భావి భారత పౌరులని ఎవరిని అనుకుంటున్నామో వారు భావి పౌరులుకారు కాని rowdy లుగా తయారవుతారని నాకు భయంగా ఉన్నది. ఇప్పటికే S. S. L. C. పరీక్షలు పోలీసు బందోబస్తుతో జరగడం సిగ్గుచేటు. గ్రామాలు వృద్ధిలోకి రావాలంటే చిన్నచిన్న నీటిపారుదల పథకాలకు ప్రాధాన్యతయిచ్చి, minor irrigation కు ఎక్కువ ద్రవ్యం కేటాయించాలని కోరుతున్నాను.

హైస్కూలు విద్యార్థులపరీక్షలు పోలీసు బందోబస్తుతో జరుపవలసివస్తు ఉన్నది. యజమానికి రైతుకూలీలకు ఉండే సంబంధాలు ఒకేవిధమైన పద్ధతిలో ఉండేట్లు చూడాలి. పెద్దపెద్ద నీటి పథకాలకు ఎక్కువ ఖర్చు చేసినారుకాని చిన్న నీటివసతులకు చాలా కొద్దిగా ఖర్చుచేసినారు. వందలాది కోట్లు రూపాయలు తేడా ఉన్నది. దానికి 108 కోట్లు పెట్టారు ; దీనికి ఒకకోటిమాత్రమే పెట్టారు. కనుక గ్రామాభివృద్ధికి రావాలంటే చిన్ననీటిపారుదల పథకాలను వృద్ధిచేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI G. RAMASWAMI REDDI :— అధ్యక్షా, రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా చూస్తే ఎన్నో ఆశలు కలుగుతున్నాయి. ఇవన్నీ ఆచరణలో సాధ్యమా అనే అనుమానం వస్తోంది మొదటి పంచవర్ష ప్రణాళికలో పట్టణాలకు సంబంధించినంతవరకు పరిశ్రమలు, భాక్రానంగల్, నాగార్జునసాగర్ వంటి ప్రాజెక్టులకు పునాదిరాళ్లు వేసుకోడం జరిగింది. వీటివల్ల వచ్చే ఫలితాలను పల్లెలు ఎక్కువగా అనుభవించలేక పోతున్నాయి. రెండవ పంచవర్ష ప్రణాళికలో గ్రామాలకు రవాణా సౌకర్యాలు కలుగచేయడానికి ఎక్కువ కోటలు చూపించవట్లు

Sri G. Ramaswami Reddi] [25th March 1956

మూసాయిదానుబట్టి అర్థం అవుతోంది. అది చాలా అవసరం. దేశంలో 70% ప్రజలు రైతులు, వ్యవసాయమే ప్రధానవృత్తిగా కలవారు. పల్లెలే దేశానికి మూలాధారం అనే విషయం ప్రభుత్వం గుర్తుంచుకొని వేసిన పథకంగా ఇది కన్పిస్తున్నది. ఆచరణలో ఎంతవరకు పెడుతారో అనుమానంగా ఉన్నది. భూసంస్కరణల విషయంలో నూటికి నూరుపాళ్లు రమణయ్య నాయుడుగారు చెప్పినదానితో ఏకీభవిస్తూ చాలా అన్యాయం అని చెబుతున్నాను. దీనితోబాటు గృహ సంస్కరణలు, మిగతా ధనికులమీద చేయవలసిన సంస్కరణలు తెచ్చినప్పుడు అభ్యంతరం లేదు. ఇవన్నీ వదలి రైతులనే ఈ రోజున సంస్కరించాలని ఆస్తులను సంస్కరించాలని తీసుకురావడం ప్రభుత్వానికి ధర్మంకాదు. దీనినిగురించి ప్రభుత్వం మరల ఆలోచించాలని మనవిచేస్తున్నాను. దేశంలో రైతులకు కావలసిన ప్రణాళికల విషయంలో కొద్దిగా చెబుతాను. దీనిని గుర్తించుకోవలసియున్నది. అనిశ్చితమైన రైతుల పరిస్థితి తీసికట్టుగా ఉన్నది. పంటలు అతి వృష్టివల్ల కాని అనావృష్టివల్ల కాని సరి అయిన పరిస్థితులలో లేక ధరలులేక రైతులు నానాటికి చాలా బాధలకు గురిఅవుతూ దండగలకు పాలవుతున్నారు. ప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళికలో దేశం మొత్తంమీద రైతుల పంటలకు భీమా సౌకర్యం కలుగచేసి తరువాత భూసంస్కరణలు తీసుకురండి. రైతుల పంటలకు పశువులకు భీమాసౌకర్యం పెట్టి వారి దుస్థితి తొలగించాలని కోరుతున్నాను. దేశంలో జనాభాలో సగానికిపైగా పశువులు ఉన్నాయి. పాడి పంటల వృద్ధి కావాలంటే పశువుల ప్రాముఖ్యం మనకు అర్థమవుతుంది. దేశంలో జరిగే రవాణా మిగతా వ్యవహారాలకంటె ఎక్కువగా పశువులవల్ల జరుగుతోందని పత్రికా ముఖంగా తెలుసుకుంటున్నాము. కాబట్టి పశువుల విషయంలో quantity కి తగినట్లుగా శ్రద్ధవహించి ఎక్కువగా వైద్య సౌకర్యాలు కలుగచేయవలసిందిగా కోరుతున్నాను. రైతులకు పరపతి సౌకర్యాలు అందుబాటులో లేవు. Red-tapism, ఉద్యోగస్థుల జాప్యంవల్ల అవి సరిగ్గా ముట్టడంలేదు. రైతులను వ్యాపారస్థులను money lenders యొక్క clutches నుంచి తొలగించాలని ప్రార్థిస్తున్నాను. పంచవర్ష ప్రణాళికలో మాకు తెలిసినంతవరకు కోళ్లు, పిట్టలు, కుక్కలు ఇటువంటి వాటిని చేర్చారు. పల్లె టూళ్లలో ఇది అనవసరం. వీటిని ఆపి రైతాంగానికి కావలసిన రహదారి సౌకర్యాలు కలుగజేస్తే మిగతా అన్ని వృత్తులలో విద్యా విషయంగా కాని ఆర్థిక విషయంగా కాని సరుకు పట్టణానికి చేర్చేదానికి సరిఅయిన ధరను రాబట్టడానికి రోడ్లు చాలా అవసరం. ఇటువంటి చిల్లర వ్యవహారాలను మానివేసి రవాణాకు ప్రాధాన్యం ఇచ్చి ప్రతి గ్రామానికి రోడ్లు పోయేట్లు ప్రభుత్వం చూడవలసిన బాధ్యత ఎంతయినా ఉన్నది. అప్పుడే ఈ ప్రణాళికయొక్క సాఫల్యంగాని సత్ఫలితాలు గాని ప్రజలు అనుభవించ

డానికి వీలు ఉంటుంది. గ్రామాలకు రోడ్లు వేసే విషయంలో ప్రాధాన్యం ఇచ్చి దేశాన్ని సర్వాంగసుందరంగా చేయడానికి తోడ్పడే విధంగా ప్రభుత్వం ఈ ముసాయిదాను సవరించాలని కోరుతున్నాను. దేశంలో పురాణత్వశాఖ లున్నాయి. నాగార్జున కొండ, అమరావతి స్థూపాలను తీసికొనండి. ప్రభుత్వం వారు నాగార్జున కొండ స్థూపాలను అక్కడే భద్రపరచి వాటిని పునర్నిర్మించాలని కోరుతున్నాను. అమరావతి స్థూపాలున్నాయి. ఇటువంటి వాటి నన్నింటిని ఏ గుంటూరు వంటి చరిత్ర హీనమయిన స్థలాల్లోనో చేర్చి చరిత్రకు కళంకం తెచ్చే పద్ధతి మాని అక్కడనే వీటిని పునర్నిర్మించడానికి పంచవర్ష ప్రణాళికలో కొంత డబ్బు కేటాయించి యాత్రికులకు rest house కట్టించి సౌకర్యాలు కలుగచేయ వలసిందిగా కోరుతున్నాను.

SRI D. V. RAMANA REDDI :—అధ్యక్షా, మనం అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సగంకాలం గతించిన తరువాత మనం ప్రణాళికను ప్రారంభించడం జరిగింది. పిమ్మట దేశాన్ని ఆవరించిన కరువుకాటకాలు, ఆవసరధాన్యాల ధరలు, జీవితావసర వస్తువుల ధరలు పెరగడం, ఈ సమస్యలతో సతమతమవుతున్న గవర్నమెంటు వాటిని సవరించు కుంటూ ఇప్పటివరకు ఈ plan మూలంగా కావలసిన అభివృద్ధికరమైన పనులను సాధించిందని చెప్పవచ్చును. స్వల్పకాలంలో రాష్ట్రంలో planning వల్ల తగినంత అభివృద్ధిని సాధించినందుకు ప్లానింగు మంత్రిగారిని అభినందించవలసి యున్నది. వారు చాకచక్యంతో 2 సంవత్సరాలలోపలే చాలా ప్రాజెక్టులకు కాని రహదారి సౌకర్యాలకు కాని కావలిసిన దోహదంఇచ్చి చక్కగా దృష్టి కేంద్రీకరించారని చెప్పడానికి ఏమిసందేహంలేదు. మనకు స్వాతంత్ర్యంవచ్చి 7 సంవత్సరాలేఅయినా ఈ కాలంలోనే ఇండియా అంతా చాలా అభివృద్ధిదశకు వచ్చింది అని ఇతర దేశాలవారు శ్లాఘించకపోలేదు. ప్లానింగువల్లనే సర్వత్రాఅన్ని సమస్యలను పరిష్కరించుకోవచ్చునని పెద్దవారుకూడా స్వార్థరహితంగా త్యాగ బుద్ధితో సేవచేయాలని అన్నివిషయాల్లో ఎల్లప్పుడూ నిమగ్నులు కావాలనే ఉద్దేశంలో ఉన్నారు. చూడండి, ఆహారపదార్థముల విషయంలో లోటుగాఉండి అన్నిదేశాలు తిరిగి పుచ్చిపోయి పనికిమాలిన ధాన్యాలు తీసుకునివచ్చి వాడుకుని చాలా అవస్థలుపడ్డాము; ఇప్పుడు ఆహారకొరత తీరిపోయి ధాన్యాలు surplus గా అయి ఇతర దేశాలకు ఎగుమతి చేయగలుగుతున్నాముఅంటే ఈ సత్ఫలితాలు సాధించి నందువల్లనే అని చెప్పక తప్పదు.

ఎన్నో కొత్త రహదారులేర్పరచారు. విద్యుచ్ఛక్తి పరిమాణమును ఎక్కువగా అభివృద్ధిచేశారు. ఈలాంటి అభివృద్ధిఅంతా planning వల్ల మనం స్వల్పకాలం

లోనే సాధించుకోగలిగాము. ఇప్పుడు బ్రహాండమైనటువంటి రెండవ ప్రణాళిక కొద్ది రోజుల్లోనే మళ్లి ప్రారంభం కాబోవుచున్నది. దీనిలో ప్రభుత్వము, ప్రజలు సమిష్టికృషిచేసి, ఫలప్రదమయ్యేట్టు చేసినపుడు మనదేశము, మీదు మిక్కిలి మన రాష్ట్రము, సర్వతో ముఖాభివృద్ధిచెంది అనుకున్నటువంటి పనులంతా చాలవరకూ సాధించుకోగలుగుతాము అనే నమ్మకంగల్గుతుంది. అయితే ఈ ప్లానింగులోని, నిమ్నోన్నతాలు చక్కచేయాలనే సమాచారం చెప్పుతున్నారుగానీ ఆ నిమ్నోన్నతాలు చక్కచేయడం అనేది ఒకవిధంగా లేకుండానే మన ప్రారంభదశ పోతుందనుకోవచ్చు. ఎట్లంటె planning లో జరిగేటటువంటుపనులు యావత్తూ develop అయినచోట్ల undevelop అయినచోట్ల సగమిచ్చుకొన్నట్లయితేనే జరుగుతుంది లేకపోతే లేదు అని చెప్పేటప్పుడు, develop అయినచోట్ల వారు సులభంగా డబ్బు యివ్వగలరు కాబట్టి, ఆ develop అయినచోటే ఇంకా develop అవుతుంది, కాబట్టి Planning యొక్క ఉద్దేశ్యంలో ఏదైనామార్పు రాకపోయినట్లయితే నిష్ప్రయోజనము అయిపోతుందని చెప్పవలసిఉంది.

అందువల్ల ఇప్పుడైనా ఒకవేళ మనరాష్ట్రప్రభుత్వాలచేత కాకపోయినప్పటికీ India Government వారికైనావ్రాసి దీనిలో ప్రతిజిల్లాలో ఉన్నటువంటి వెనుకబడిన తాలూకాల list ను తీసుకుని ఆప్రాంతాల్లో ఉండేటటువంటి ఆర్థిక యిబ్బందులను గమనించి వాళ్లు ¼ భాగము యిచ్చుకోనేటట్లున్నా తక్కిన develop అయినచోట్లకు ఒక list తయారుచేసి అక్కడ ½ భాగముయిచ్చుకానేటట్లుచేసినప్పుడే మనము అనుకొన్నటువంటి planning ఉద్దేశాలు నెరవేరి గ్రామాలు అభివృద్ధిచెందుతాయి. అది లేనప్పుడు మన ఉద్దేశము నెరవేరదు. planning ఉద్దేశము చెడిపోవును. ఇప్పుడిప్పుడు అనుకున్నటువంటి ఆ నిమ్నోన్నతాలు యిక్కడినుంచే మొదలుపెట్టాలిగాని అది లేనప్పుడు, Socialistic pattern of society అనేటటువంటిదానికి అర్థమేలేకుండా పోతుంది. ఇప్పుడు ఈ upland తాలూకాలుగా ప్రతిజిల్లాలో ఉన్నటువంటివాటిని ఒక లెక్కవేసి వాళ్ళకు ఈ planning యొక్క భాగ్యాన్ని సమకూర్చాలంటే తగినటువంటి సదుపాయాలు ఏర్పరచదలసినప్పుడు మాత్రమే చేయగలుగుతారేగాని అది లేనప్పుడు ఎంతమాత్రము వీలుకాదు. కనుక ఆ విషయాన్ని ప్రభుత్వం గమనించవలసినదిగా నా ప్రార్థన. ఏదేశమైన పరిశ్రమలలో పూర్తిగా ముందుకు రానిదే ఏ విషయములోగాని ముందుకు రావటానికి ఆస్కారములేదు. అందువల్ల భారీఅయినటువంటి పరిశ్రమలు నెలకొల్పి నిరుద్యోగాన్ని ఏ మాత్రము లేకుండాచేసి దానిలో ఎక్కువభాగము వెనుకబడిన ప్రాంతాలకు కేటాయించవలసిందిగా కూడా నా మనవి. పట్టణప్రాంతాల్లో క్రొత్త ప్యాక్టరీలను నిర్మించడం పాతవాటిని

విస్తృతపరచడంద్వారా నిరుద్యోగసమస్య కొంతవరకు పరిష్కరించడానికి అవకాశము ఏర్పడగలదు. Banking సౌకర్యాలు రాకపోకల మార్గాల అభివృద్ధి వల్ల కూడా చాలామందికి ఉద్యోగాలు చూపించవచ్చు. ప్రాథమిక విద్యను మన మెంతో వృద్ధిచేస్తున్నామని చెప్పుతున్నాముగాని ప్రాథమికవిద్యలో చాలా యిబ్బందులున్నవి. ప్రాథమికపాఠశాలలకు Deputy Inspector యే ప్రధానాధికారి. D. E. O. లుగా ఉన్నటువంటివాళ్లకు వాహనాలుకూడా లేనందువల్ల ప్రాథమికపాఠశాలలను ఎప్పుడూ కూడా ఒక్కటినైనా పోయి చూడటానికి వీలులేకుండా ఉన్నది. 100 కి 90 పాళ్లు ప్రాథమిక పాఠశాలలు బోగసుగా ఉంటూ Deputy Inspector దయతో ఊరకనే వారు డబ్బు సంపాదించుకోవటం, పాలిటిక్సులో దిగటం, పిల్లకాయలకు కూడా ఎవో ఒక జండా యిచ్చి తయారుచేయడంతప్ప ప్రాథమికపాఠశాలలు మాత్రము చక్కని తరహాలో లేవని చెప్పవలసి ఉన్నది ఇంతడబ్బు ఖర్చుచేసేటప్పుడు ఒక్కజిల్లా అధికారిగా ఉండే D.E.O కు వాహనముకూడా లేకుండా ఆయన జిల్లామొత్తము ఏ వెయ్యో పదునైదువందల గ్రామాలలో సంవత్సరానికి ఒక్కసారి అయినా ఆ పాఠశాలలను చూడటానికి వీలులేకుండా ఒక్క Deputy Inspector మీదనే ఆధారపడి ఆ పాఠశాలల అభ్యున్నతిని ఆయన ఒక్కనిమీదనే వదలివేయటం కొరకే డబ్బు ఖర్చవుతున్నదేగాని బాలురకు మాత్రము విద్యాయోగ్యతలు లేకుండా వృథా అయిపోతుంది. ఇక సామ్యవాదము ప్రకారం భూములపంపకాలు చేసి బీదప్రజలకు ఇవ్వాలి అనేది అందరు ఒప్పుకుంటున్నారు. ఆవిధంగాచేసి నిమ్నోన్నతాలు చక్కజేయవలసింది వాస్తవమేగాని, భూమి ఉన్నవారికంటేకూడా ఇంకా అధికమైనసంపత్తు కలిగినటువంటి వాళ్లు అనేకమంది ఉన్నారు. అన్నిటిని కూడా సమానమైనటువంటి స్థితికి తీసుకరావటమనేది చేయవలెగాని ఒక్క భూమి పంపకంతోనే Socialistic pattern of society చక్కబడుతుందని అనుకోవడానికి వీలులేదు. భూమి ఉన్నటువంటివారిలో తిండికి జరుగనటువంటివారు కూడా ఉన్నారు. Bankers వున్నారు. ఇలాంటి ద్రవ్యదాతలు అనేకమంది ఉండినకూడా వాళ్ల కేయిబ్బందిలేకుండా, పన్నులు వచ్చినప్పుడు వీళ్లే అన్ని అనుభవించాల్సి వస్తూంటుంది. కొబట్టి సర్వసంపదలుకూడా చక్కగా పంచినప్పుడే మన మనుకున్న నిమ్నోన్నతాలు చక్కచేయటమనేది వీలుంటుంది. ఆ ప్రకారం చేయటంకూడా చాలా అవసరం. అందరు త్యాగంచేసి ప్లానింగును చక్కగా ఏర్పాటుచేసి దేశ సౌభాగ్యానికి తోడ్పడాలి అని చెప్పుతున్నారుకదా. కాని అధికారులలోకూడా పెద్ద జీతాలు తీసుకుంటూ ఏ యిబ్బందులు లేకుండా ఉండేవారున్నారు. పదిరూపాయలు యిరవైరూపాయలతో ఒకడు తృప్తిపడటం, ఒకడు వేలు సంపాదించడం జరుగుతూవుంది. కనుక Government వారి పద్ధతులను మార్చి ఉద్యోగులలోకూడ

Sri D. V. Ramana Reddi] [25th March 1956

నిమ్నోన్నతాలను సమకూర్చి చివరకు ఒత్తిడిచేతనైన దేశసౌభాగ్యానికి తోడ్పడాలని, చదువుసంధ్యలు లేనటువంటి వాళ్లమీద మనం ప్రభోధంచేసేటప్పుడు విద్యాధికులుగా ఉండి దేశములో బాగుపడుతూ ఉండేటటువంటి వాళ్లు మనస్ఫూర్తిగా తమజీతాలను తగ్గించుకొని సహకరించడం చాలా అవసరం కాబట్టి ఆవిధంగా చేయవలసినటువంటి అవసరం ఎంతో ఉందని నా మనవి. Local Development Works చాలా ప్రయోజనకారిగా ఉండి ఈ సంవత్సరం స్కీములో అవి తొలగిస్తారని సమాచారము తెలుస్తుంది. కాబట్టి దయచేసి వాటిని ఈ సంవత్సరం కూడా ఉంచి వాటిమూలకంగా కూడా ప్రజల్లో ఎక్కువైనటువంటి చైతన్యము కలిగించి planning కు గాని మరి దేనికైనగాని తోడ్పడేరీతిగా ప్రభుత్వమువారు చేస్తారని ఆశిస్తూ ఉన్నాను.

SRI D RAMABRAHMAM :—అధ్యక్షా, నేడు మనం చర్చిస్తున్నటువంటి ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇప్పుడు నాగార్జునసాగరు విషయంలోనే కాకుండా విద్యా సదుపాయాల విషయంలో ప్రాథమిక పాఠశాలలు 1000, మాధ్యమిక పాఠశాలలు 60, ఉన్నత పాఠశాలలు 25, ఈవిధంగా వీటి సంఖ్యను పొడిగించి దేశములో విద్యావిధానాన్ని అభివృద్ధి పఱచినందులకు మంత్రివర్గాన్ని అభినందించడమే కాకుండా వారు చేసేటటువంటి ఆ ఘనకార్యాలకు అందరు తోడ్పడవలసిందిగాకూడా నేను మనవిచేసుకుంటున్నాను. ఈ ఐదేండ్లలో మన జాతీయ ఆదాయాన్ని 25% పెంచి 80 లక్షలకు పైగా మన దేశములో ఉండేటటువంటి వారికి జీవన భృతి కల్పించేదానికోసం మన ప్రభుత్వం ఈ ప్రణాళిక ద్వారా చాలా ప్రయత్నాలు చేస్తున్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక, మనకు వచ్చిన రోజుల్లో మనం ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నందువల్ల పూర్తి ఫలితాన్ని మన మనుభవించలేక పోయినామని planning మంత్రిగారి ఉపన్యాసములోనే చెప్పబడినది. మనకు ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రములో మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో Local Development Schemes ద్వారా చాలాపనులు కొనసాగినాయి అయినా ప్రజలు దానియొక్క ఉపయోగాన్ని కనుక్కోవడానికి ఒక్క సంవత్సరం పైగా పట్టింది. తరువాత ఈ సిబ్బందులులేక పోవడం Local Development Schemes కు కావలసినటువంటి ఇనుము, ఉక్కు, సిమెంటు, ఇవన్నికూడ లేక పోవడంవల్ల అచ్చటచ్చట State లో ఇప్పుడు ఈ schemes మరికొన్ని కట్టడాలు వగైరాలు అన్నిగూడా పూర్తికాలేదు. పనులన్నీ సగంలో ఉన్నాయి.

రెండవ పంచవర్ష ప్రనాళికల్లో మొదటి సంవత్సరం మాత్రం యీ Local Development Schemes ఏవి పూర్తి కాలేదో వానినైనా పూర్తిచేసే సదుపాయాలు ప్రభుత్వం చేసిపెట్టాలని మాత్రం నేను ప్రభుత్వానికి మనవిచేసుకుంటున్నాను. ఇప్పుడు మనదేశం వ్యవసాయక దేశం. మనం ఉమ్మడి రాష్ట్రంలో

ఉన్నందువల్ల మన ఆంధ్ర రాష్ట్రంలో కావలసినటువంటి industries ఏమీ వృద్ధి కాకుండా చిన్న industries అయినాకాని వృద్ధికాక మనం పారిశ్రామికంగా చాలా వెనుకబడి ఉన్నాం. అది ఒకటే కాదు. మన ఆంధ్ర దేశంలో ఉత్తర దేశంలో కాని లేదా దక్షిణ దేశంలోకాని యిప్పుడు industries అభివృద్ధి అయ్యాయంటే అక్కడుండే ప్రజాసహకారం Labour సహకారం వలననే అని నమ్ముతున్నాను. పెట్టుబడి పెట్టేవారికికూడా తగువైనటువంటి హామీలున్నందు వల్ల అక్కడ పరిశ్రమలు అభివృద్ధి పొందగలిగాయి. మన ఆంధ్ర దేశంలో గత ఎన్నికలలో జరిగినటువంటి పార్టీ దృక్పథంచేత మనకు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో ఎవరైనాసరే పెట్టుబడి పెట్టి కర్మాగారాలు స్థాపితం చేయవలసివస్తే అప్పుడున్నటువంటి ఆపార్టీ వైరుధ్యంచేత ఎవరూకూడా industries వృద్ధి చేయడానికి అవకాశాలు లేక భయాందోళనలకు గురికావలసి వచ్చింది. ఆ భయోత్పాతం యీ ఎన్నికలలో పోయింది; స్థిరమైన ప్రభుత్వం ఏర్పడింది. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో మనదేశంలో మనం అనుకొన్నటు వంటి industries అంతా ఎక్కువ చేయడానికి మన ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నది. అందులో యిప్పుడు 5 sugar factory లను ఏర్పాటు చేయడమే కాకుండా ఇంకా అక్కడక్కడ చిన్నచిన్న factory లను రాజమండ్రి paper mill అయితేనేం, యితర నూనె మిల్లులుకూడా మన ప్రభుత్వం స్థాపించవలసినదని కోరుతున్నాను. అయినా యిప్పుడు మన planning మంత్రిగారు చెబుతూ యీ sugar factory కి తగువైనటువంటి ధనం ప్రజలనుండి రాలేదని చెప్పారు. మన ఆంధ్రదేశం చాల బీదదేశం. ప్రజలంతా వ్యవసాయంపైన మోజు చూపుతున్నారేగాని industries మీద మోజు చూపడంలేదు. మన ఆంధ్రదేశంలో చేనేతపరిశ్రమ చాల హెచ్చుగా ఉన్నది. మనకు కావలసిన నూలు యితరరాష్ట్రాలనుంచి తెప్పించుకుంటున్నాం. అదిగాక పెద్దపెద్ద మిల్లులు పెట్టాలంటే చాల యిబ్బందులున్న మాట వాస్తవమే. అయినా మొన్న డిల్లీలో జరిగినటువంటి Industries ప్రదర్శనం సందర్భంలో అచటికి విదేశాలనుంచి వచ్చిన 250 spindles తయారైనటు వంటి యంత్రాన్ని ప్రదర్శించారు. మొత్తం 3 లక్షలతో 250 spindles తయారుచేసే machinery పెట్టవచ్చుననే అభిప్రాయంతో అక్కడి Director of Industries కూడా చెప్పారు. కేంద్రప్రభుత్వం పెద్దపెద్ద మిల్లుయజమానుల ప్రాబల్యం ఎక్కువగా ఉన్నందువల్ల చిన్నచిన్న మిల్లులకు State level లో licence లు యివ్వకుండా యిబ్బందులు కలుగజేస్తున్నారు అని తెలియవస్తున్నది. కాబట్టి మన ఆంధ్ర ప్రభుత్వం యీ చిన్న చిన్న నూలు

mill లను తయారుచేయడానికి తగుమైన ప్రయత్నం చేయాలని కోరుతున్నాను నా నియోజకవర్గంలో గంధపునూనె పరిశ్రమలున్నాయి అక్కడ 4, 5 factory లు గంధపునూనె పరిశ్రమచేస్తున్నాయి. ఈ రాష్ట్రవిభజన అయ్యాక Coorg, Belgaum, Dharwar ప్రదేశాలన్నీ మైసూరురాష్ట్రంలో చేరిపోతున్నాయి. ఈ ప్రదేశాలు మైసూరురాష్ట్రంలో చేరిపోతున్న సందర్భంలో మన ఆంధ్రదేశములోని గంధపునూనె పరిశ్రమకు చాలా దెబ్బతగిలే సూచన ఉన్నది ఇదివరకుకూడా Coorgనుంచి Dharwarనుంచి Belgaum ప్రాంతాలనుంచి Government ద్వారా అచ్చటికి కావలసినంత గంధపుచెక్క వచ్చేది. ఇప్పుడు ఆప్రదేశాలన్నీ మైసూరురాష్ట్రములో చేరిపోయే సందర్భంలో మైసూరురాష్ట్రంలోనే distillators ఉన్నందువల్ల ఆచెక్క అంతా ఉపయోగించడంచేత మన పరిశ్రమకు దెబ్బతగులుతుంది మనం మద్రాసురాష్ట్రంలోగాని లేక మనరాష్ట్రంలోగాని పెరుగుతున్న గంధపుచెట్లనుంచి వచ్చేచెక్కతోనే తయారుచేసుకోవలసిన పరిస్థితి ఉంటుంది. కాబట్టి మనపరిశ్రమలకు దెబ్బతగులకుండా యీ factoryలకుసదుపాయం కలుగజేయవలసివుంటుంది. ఇదివరకు Singapore నుంచికూడా పచోనీ ఆకును తెప్పించి దాంతో నూనెతయారుచేసేవారు దానిని పెద్ద పెద్ద soap factory లకు supply చేసేవారు. యుద్ధానంతరం కొన్ని ఆటంకాలు, duties ఎక్కువయినందువల్ల ఆ ఆకు రావడంలేదు ఈ ఆకులు మన దేశంలో తయారుచేసుకునే పరిస్థితులున్నాయి. ఈ ఆకు ద్వారా నూనె తయారుచేసుకోవచ్చు. అదేకాకుండా యింకా ginger grass, lemon grass మన అడవులలో దొరుకుతున్నాయి. వాటినుండి కొన్ని oils తయారుచేసి అవికూడా soap industries లో ఉపయోగించవచ్చు. కుప్పం కేంద్రంలో యీ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరమే పరిశోధన కేంద్రం అక్కడ ఒకటి స్థాపించవలసినదిగా నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అది కాకుండా పరుపుల పరిశ్రమకు కావలసినటువంటి దూదిని మలబారు నుంచి తెప్పించుకుంటున్నాం. గత ప్రభుత్వంలో తిమ్మారెడ్డిగారు మంత్రిగా ఉన్నప్పుడు మన అడవులలో కూడా బూరుగు దూది చెట్లను నాటడానికి కొన్ని వసతులు కలుగచేసి plantation కూడా ప్రారంభించారు. ఇప్పుడు 2, 3 లక్షల రూపాయల విలువ కలిగినటువంటి ప్రత్తిని యితర రాష్ట్రాలనుంచి తెప్పించుకుంటున్నాం. మన దేశంలో పైరు వేస్తే మన అడవులలో అది ప్రత్యేకంగా పండగలదనే ఉద్దేశంతో Conservator గారు యిప్పుడు దాని చెట్లు నాటించి ప్రోత్సాహంచేస్తున్నారు. ప్రభుత్వం కూడా యీ రెండవ పంచవర్ష ప్రణాళికలో sandal wood పెంపకానికి బూరుగు పెంపకానికి forests లో తగుమైనటువంటి చర్యలు తీసుకోవలసి

నదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. కడపట మా జిల్లా planning లో నా నియోజకవర్గంలో గోనెమూకులపల్లె అనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో వ్యవసాయానికి కావలసినటువంటి పనిముట్లను 300 కుటుంబాలకు పైగా చేతితోనే తయారుచేస్తున్నారు. ఆ గ్రామానికి ప్రక్కనే electricity యిప్పుడు క్రొత్తగా వచ్చింది. ఆ electricity మార్గంలో ఉన్న ఆ గ్రామానికి తగుమైనటువంటి factory పెట్టి 300 కుటుంబాలను Co-operative Institute తయారుచేస్తే మన దేశంలో కావలసినటువంటి agricultural implements అంతా తయారుచేయ డానికి అవకాశాలున్నాయి. ఇదివరకు Director of Industries కూడా అక్కడకు వచ్చి దానిని పరిశోధనచేసి ఆ జిల్లా పథకంలో include చేశారు. అది రాష్ట్ర planning లో ఏమయినదో కాని తెలియలేదు. కాబట్టి దానికికూడా మంత్రిగారు తగినటువంటి వసతులు కలుగచేయవలసినదిగా కోరుతూ ముగిస్తున్నాను.

SRI. B. G. M. A. NARASINGA RAO :—అధ్యక్షా, మనం ఇప్పుడు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మీద విమర్శలు, సమీక్షలు జరుపుతున్నాము. ఇది చాలా మహోన్నతమైనది. చాలా మహోన్నతమైన ఆశయాలతో ఈ ప్రణాళికను రచించారు. ఇది 7 వేలకోట్ల రూపాయల ప్రణాళిక. ఏ సంవత్సరములలో ఇంత పెద్ద మొత్తాన్ని ఖర్చుపెట్టడానికి పూనుకోవడము సాహసమే. ఈ ప్రణాళిక విజయవంతము కావలయునని కోరడం యావన్మంది భారతప్రజల కర్తవ్యం. మొదటి పంచ వర్ష ప్రణాళిక ఆఖరుదశకు మనం వచ్చినాము. అది ఈ నెల 31 తేదీతో అంత మవుతుంది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలములో భారతదేశం సాధించిన విజయాలను చూచినట్లయితే చాలా అద్భుతమని మనము చెప్పుకోవడమే కాకుండా మనదేశమునకు వచ్చిన ప్రతివారుకూడా మనదేశం ఇంత స్వల్పకాలంలో అద్భుతమైన విజయాన్ని సాధించినదని చెప్పుకొంటున్నారు. అయితే మనదేశస్థులలో కొందరు, మనం సాధించిన విజయములను చెప్పుకోలేక పోతున్నారు. ఇక్కడ జరుగుతున్న విమర్శలను, తదితరచోట్ల జరుగుతున్న విమర్శలను చూచుకున్నట్లయితే భారతదేశం అభివృద్ధిమార్గంలో నడవడం, అభివృద్ధిచెందడం కొందరికి ఇష్టములేనట్లు అనిపిస్తున్నది. అయితే ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను చర్చించే సమయంలోకూడా, మొదటి పంచవర్ష ప్రణాళికలో పొందిన పరాజయాలను తిరిగి మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పొందుతున్నాము అన్నారు. నిజముగా మొదటి ప్రణాళికలో పొందిన విజయాలను మనం ద్వితీయప్రణాళికలోకూడా పొందినట్లయితే భారతదేశము అచిరకాలంలో పురోభివృద్ధిచెంది, తదితర దేశాలకన్నా చాలా ఎక్కువగా అభివృద్ధిచెందుతుందని నానమ్మకము. భారతదేశ ప్రజలందరి యొక్క ఆశయంకూడా ఇదేనని నా నమ్మకం. ఎవరు అయితే భారతదేశ విజయాన్ని

కొంచలేకుండా ఉన్నారో, వారందరికికూడా ఈ విజయంలో disappointment కలుగుతుంది అని నేను చెప్పగలుగుతున్నాను. ఈ ప్రణాళికా రచన చాలా elastic గా ఉండాలని నేను మనవిచేస్తున్నాను. ఈ ప్రణాళికరచనలో వున్న ప్రకారం మనం పనిచేయలేకపోతే ఆ సొమ్ము మురిగిపోతే అప్పుడు చాలా కష్టంగా వుంటుంది. అందువల్ల అది elastic గా ఉండాలని. ఎప్పటికప్పుడు పరిస్థితులకు అనుగుణంగా ప్రణాళికను ఏవిధంగా కావాలంటే ఆవిధంగా మార్చుకోవడానికి వీలుండాలని నేను కోరుతున్నాను.

నిన్న సుందరయ్యగారు ఈ ప్రణాళికమీద మాట్లాడుతూ, చైనాదేశంగురించి ఒక గంటసేపు చెప్పారు. చైనా మనకు మిత్రదేశమే. అది అభివృద్ధిగావాలనే మనంకూడా కోరుతున్నాము కాని ఆ దేశపు అభివృద్ధిని, మనదేశపు అభివృద్ధితో పోల్చిచూడడం ఎక్కడా సామ్యముగాని వింత. చైనాదేశం గత 35 సంవత్సరములుగా ఒకప్రక్క జపానుయుద్ధములో, రెండవప్రక్క అంతరయుద్ధములో నలిగిపోయి, భూపతనము అయిపోయింది. అటువంటి పతనం పొందిన చైనా దేశం మరల అభివృద్ధిచెందడంలో విశేషము ఏమీలేదు, కష్టంకాదు కూడ. భారత దేశానికి అటువంటి అవాంతరము ఏమీరాలేదు. భారత దేశ ప్రజలు అటువంటి అవాంతరము ఏమీలేకుండా స్వల్పకాలంలో కోలుకొనగలిగారు. జర్మనీ చితికి పోయి మరల అభివృద్ధికాంచింది. చైనాకూడ ఆ విధంగానే అభివృద్ధి గాంచింది. సర్వ నాశనము అయిపోయిన ఇంగ్లండు మరల స్వల్పకాలంలో గాంచిన అభివృద్ధి చూస్తే, అది ఒక అభివృద్ధి కాదేమో అనిపిస్తుంది.

మన విషయం గురించి మనము మాట్లాడుకొన్నట్లయితే మనకు స్వాతంత్ర్యము లభించిన తరువాత, గత 5 సంవత్సరములలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రవేశ పెట్టిన తరువాత అంతకుముందు తిండికి, గుడ్డకు. అల్లాడిపోతున్న ప్రజలు ఈ నాడు సుఖజీవనం అనుభవిస్తున్నారు. అది మన భారత దేశ ప్రజలందరూ గర్వించ దగిన విషయం.

మనం పెద్దపెద్ద ప్రాజెక్టులు నిర్మించుకొంటున్నాము. దామోదర ప్రాజెక్టు హీ-రాకుడ్, తుంగభద్రా, నాగార్జున సాగర్ ప్రాజెక్టులు నిర్మించుకుంటున్నాము. ఇదంతా దేశ అభివృద్ధికాదా ? హిందూస్థాన్ షిప్పు యార్డు, చిత్తరంజన్ ఫ్యాక్టరీ ఇవన్నీ ఏమిటి, పెద్ద పరిశ్రమలు కావా ? ఇవన్నీ కన్పించడము లేదా ? ఇది అంతా అభివృద్ధి కాదా ? ఏ దేశం ఇంత స్వల్ప కాలంలో అభివృద్ధి సాధించిందో ఎవరైనా చెప్పమనండి చూద్దాము.

రష్యా అభివృద్ధిచెందేందుకు 35 సంవత్సరములు పట్టింది అని ఎవరైనా అంటా రేమో అని ఇప్పుడు చైనా పేరు చెబుతున్నారు. మనంకూడా త్వరలోనే పూర్తి అభివృద్ధి సాధిస్తాము. మీరంతాకూడా మన అభివృద్ధికి నిరోధకంలేకుండా ఉంటే 5 సంవత్సరముల్లో కాంచే అభివృద్ధిని, 2 సంవత్సరములలో గావించవచ్చును అని నేను ఖచ్చితంగా చెబుతున్నాను

నిన్న సుందరయ్యగారు సహకారము ఇస్తాము అని చెప్పారు. దీనికి కొన్ని షరతులు పెట్టారు. ఇది జేస్తే ఇస్తాము, అది చేస్తే ఇస్తాము అంటున్నారు. ఇది అంతా హాస్యాస్పదంగా కన్పించుతున్నది. ఇది భావ్యంగా లేదు. సహకారంఇచ్చే విషయములో భారత కమ్యూనిష్టుపార్టీకూడా చాలా తీవ్రంగా ఆలోచించుతున్నది. భారతప్రభుత్వానికి ఎటువంటి మద్దతు ఇవ్వాలని ఆలోచిస్తు న్నది. ఆంధ్రకమ్యూనిష్టులుకూడా, వారి పాలసీని మార్చుకొని ప్రభుత్వానికి ప్రణాళికను అమలుపరచే విషయంలో తగిన సహకారము ఇవ్వాలని కోరుతున్నాను. ఒకసారి మనము పరిశోధనచేసుకొని భారత ప్రజలకు, ఆంధ్ర ప్రజలకు, దోహ దము చేసినవారము అవ్వాలని, గ్రామాలకుపోయి, ఇది మనగ్రామం, మనం కష్టపడి పనిచేయాలి, మనం పనిచేయకపోతే అభివృద్ధి సాగదుఅని ఏనాడైతే కమ్యూనిష్టులు నెత్తిమీద తట్టపెట్టుకొని పనిచేస్తారో, ఆనాడు తప్పకుండా అభివృద్ధిని చాలా శీఘ్రంగా సాధించగలము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మీరు ఎప్పుడు అయినా అట్లా పనిచేశారా ?

SRI B. G. M. A. NARASINAGA RAO :—చేశాము, చేశాము, వెంకటేశ్వర్లుగారికి తెలియదేమో, నెత్తిమీద తట్టపెట్టి పనిచేశాను. కబుర్లుచెప్పడం మీవంతు, నేను పనిచేసి చూపించాను. అందుచేతనే కమ్యూనిస్టులను కబుర్లుచెప్పడం మాని, గ్రామాలకుపోయి, ప్రజలనుఉత్తేజపరచి, సహకారం చేయండని, భారత దేశాన్ని, అభివృద్ధి గావించండి అని నేను హృదయపూర్వకంగా కోరుతున్నాను.

N. E. S. బ్లాకులను పంచవర్ష ప్రణాళికలో రాష్ట్రం అంతా వ్యాపింప చేస్తాము అని చెప్పారు. అవి చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. ఈ బ్లాకుల పనులలో ఇర్రిగేషన్ లేదు. ఇర్రిగేషనును ఒక్క కమ్యూనిటీ డెవలప్ మెంటు స్కీములకు ఇచ్చారు. ఇర్రిగేషన్ పనులుకూడా N.E.S. బ్లాకులకు అప్పగించి నట్లయితే చిన్న చిన్న నీటివనర్లు ఏర్పాటుచేసి గ్రామీణ అవసరములను తీరుస్తారు.

ఈ బ్లాకులలో పనిచేయడానికి సమాస్తా ఉద్యోగాలకొరకు తయారయిన S. S. L. C. ప్యాసుఅయినవారిని వేస్తున్నారు. వారికి Village level work లో

సరియైన అనుభవముగాని, శిక్షణగానిలేదు. అందుచేత ప్రజాసేవచేస్తున్నవారు చాలామంది ఉన్నారు. అటువంటి ప్రజాసేవలో శిక్షణపొందిన యువకులకు ఈ Village level work నకు అవకాశము ఇచ్చినట్లయితే ఎక్కువ సహకారముచేసి, ప్రజలను ఉత్తేజపరచి వారిచ్చే కార్యక్రమములు చేయడానికి అవకాశము ఉంటుంది. వారందరిని S. S. L. C. ప్యాసు కావాలని, వయోపరిమితి, అటువంటి నిబంధనలు పెట్టకుండా తీసుకోవాలని కోరుతున్నాను.

National Rural Water Supply scheme ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో తీసుకు వచ్చారు. దాంటో పైలెటుస్కీములను మన రాష్ట్రంలో 4 తాలూకాలకు ఇచ్చారు. ఆ స్కీములు గ్రామీణప్రజల నీటి అవసరాలను తీర్చేందుకు అనిచెప్పారు. అందులో ఒక్కొక్కరికి ఇన్ని గాలన్లు నీరు అనే ప్రాతిపదికమీద, గ్రామప్రజల నీటి అవసరాలను తీరుస్తామని అంటున్నారు. అయితే నీరులేనిచోట్ల నూతులు త్రవ్వుతారని అనుకున్నారు. అట్లు కాకుండా ఆ ప్రాంతాలలో protected water supply కలుగజేసేందుకు గ్రామాలలో నూతులు త్రవ్వి వానిమీద సిమెంటు చప్టాచేసి, ఒక కంతపెట్టి, దానికి పంపులను బిగించి వాటిద్వారా ప్రజలకు నీరు సరఫరా చేస్తాము అంటున్నారు.

ఇప్పుడు డబ్బు ఉన్నదికనుక ఖర్చుచేస్తారు ఇకముందు maintenance and repairs ఎవరుచేస్తారు ? ఈ నూతులకు operation కు అయ్యే ఖర్చు ఎవరు భరిస్తారు.

The HON. SRI K. VENKATA RAO :—ఎవరు operate చేస్తారో వారేభరిస్తారు.

SRI B. G. M. A. NARASINGA RAO :—గ్రామీణ ప్రజల స్థితిగతులను చాలా జాగ్రతగా పరిశీలించి, వారిపై అక్రమంగా భారంవేయకుండా వారి అవసరాలను తీర్చడానికి ఏదైనా సూక్ష్మోపాయం ఆలోచించాలి. ఇటువంటి అమలు జరుపుటకు సాధ్యంకాని, ఆచరణయోగ్యం కాని స్కీములను తయారుచేసినట్లయితే ప్రజలకు చాలా కష్టంగా ఉంటుందని చెప్పి మనవి చేస్తున్నాను. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలో heavy Industries ముఖ్యావసరమై ఉన్నవి. ప్రభుత్వం వారు వాటిని నెలకొల్పుటకు శాయశక్తులా కృషిచేస్తున్నారని విని చాలా సంతోషిస్తున్నాను. "ఆంధ్ర రాష్ట్రంలో heavy industries అవసరము" అనే అభ్యర్థనను మంత్రిగారు తప్పకుండా కేంద్రప్రభుత్వానికి పంపించాలి. ఆంధ్ర రాష్ట్రములోని యావన్మంది ప్రజలు heavy electrical equipment తయారు చేసే factory కావాలని వాంఛిస్తున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో ఎరువులు ఎక్కు-

వగా వినియోగించుచున్నారు. కాబట్టి ఎరువుల ఫ్యాక్టరీని ఒకటి స్థాపించుకోవాలి. విశాలాంధ్ర రాబోతున్నది. కాబట్టి fertiliser factory మొదలైనవి ఆంధ్ర రాష్ట్రంలో తప్పకుండా నెలకొల్పాలని ఆంధ్ర శాసనసభ్యుల అభిప్రాయాన్ని భారత ప్రభుత్వానికి పంపించ వలసిందిగా కోరుతున్నాను.

Sri P. RAMACHARLU:—అధ్యక్షా, ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను అతిజాగ్రతగా, దూరదృష్టితో తయారుచేసినారు. గ్రామాలు, తాలూకాలు, మండలాలు, రాష్ట్రసంఘాలుకూడ తయారుచేసి కేంద్రప్రభుత్వానికి పంపించారు. అక్కడ ఉండే మేధావులందరూ దానిని ఒక ప్రణాళికరూపంలో తయారుచేసిపంపించారు. ఇప్పుడు ఈ ప్రణాళికలో కొంత చేర్చడంగాని, తీసివేయడంగాని చేయకూడదు ఒకరొకరే వారికి ఇష్టములేని అంశాలన్నీ దీంట్లోనుంచి తీసివేస్తే అసలు ప్రణాళికే ఉండదు. పూర్వం ఆర్యసమాజం వారు నాతో మాట్లాడుతూ "భారతంలో వుండే ధృతరాష్ట్ర పాండురాజుల జననం ఆట్టే బాగుండలేదు, కాబట్టి ఆపుట చించివేయండి" అన్నారు. అట్టిదే ఒకటి మీ "సత్యార్థప్రకాశ" లో ఉన్నది అన్నాను. అదికూడ చించివేయవలసినదే అన్నారు ఈ విధంగా ఎవరికి సరిపడని పుటలను వారు చింపేస్తూవుంటే ఇక సత్యంవుండదు, ప్రకాశం వుండదు. కాబట్టి ఉండనివ్వండి ఎవరైనా చదువుకుంటారు అన్నాను ఈ ప్రణాళికను మేధావంతులు తయారుచేసినారు. ఇదిలేదు, అదిలేదు అనకుండా మనమంతా దీనిని అంగీకరించాలి. దేశం మొత్తం దృష్టిలో పెట్టుకొని దీనిని ఏర్పాటుచేసినారు. 4,1800 కోట్లరూపాయలు ఖర్చుచేయాలని ఈప్రణాళికలో వున్నది అందులో మన భాగం కొంచెమే ఈ ప్రణాళిలో మనకందరకు సంబంధించిన రైల్వేలు, ఫ్యాక్టరీలు, స్టీమర్లు మొదలయినవన్నీకూడా చేయడానికి సంకల్పించారు. దానిలో మన భాగంకూడా ఉన్నది ఈ అభివృద్ధి ప్రత్యేకంగా మన ఒక్కరికీ సంబంధించినది కాదు. దేశం మొత్తంమీద అందరికీ పనికివచ్చేది. మిలిటరీకి వెయ్యికోట్లరూపాయలు ఎందుకు ఖర్చుపెట్టాలి ? మనకు మిలిటరీ ఎందుకు ? మనది అహింసాతత్వం, బుద్ధుని సిద్ధాంతం, అటువంటప్పుడు మనకి మిలిటరీ ఎందుకు అని కొంతమంది సభ్యులు ప్రశ్నిస్తున్నారు. కాని అన్నిటికంటె ముఖ్యమైనది దేశరక్షణ. దేశరక్షణ లేకుండా ఎన్ని అభివృద్ధిప్రణాళికలను తయారుచేసుకొన్నప్పటికీ, దేశాన్ని ఎవరో ఆక్రమించి, ఫలితాన్ని వారు పొందితే ఏమి ప్రయోజనం. మనం ఏదైనా ఒక పని చేస్తే దానివల్లవచ్చే ఫలితాన్ని మనం పొందేలా ఉండాలికాని ఎవరో శత్రువులు ఆ ఫలితాన్ని పొందితే ఏమి ప్రయోజనం ? అందుచేత మనం మిలిటరీని సిద్ధంగా తయారుచేసి ఉంచుకోవాలి విమానాలు, స్టీమర్లు మొదలయినవన్నీకూడా తయారుచేసుకోవాలి. "మాది అహింసాతత్వం మేము అభివృద్ధిప్రణాళికలను పూర్తిచేసుకొంటు

న్నాము, ఇంకా కొన్ని చేసుకోవాలి. ఇంకా మేము మిలిట్రీని తయారుచేసుకోవాలి కొన్నాళ్లు ఆగండి. "ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయితేనేగాని మేము యుద్ధానికి దిగలేము అంటే శత్రువులు ఆగుతారా? మనలోపాలను శత్రువులు కనిపెట్టి మన దేశాన్ని ఆక్రమించుకోడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. ఇదివరకు బౌద్ధమతం, అహింసాతత్వాలకు అలవాటుపడి మన పూర్వులందరూ యుద్ధములు చేయకుండా దేశాన్ని పౌరుషవంతంగా లేకుండా ఇతరదేశాలకు వంగిఉండేట్లు శోచనీయస్థితికి తీసుకువచ్చారు. పూర్వం 13, 14 శతాబ్దాలలో సుమిత్రా ద్వీపంలో కూడ బౌద్ధమతము నవలంబించి సైన్యాలను ఉంచుకొనకుండా ఉన్నప్పుడు అరబ్బులు వారియొక్క సమాచారం తెలుసుకొని, వారిదగ్గర ఆయుధాలులేవని తెలుసుకొని మరుసటిసంవత్సరం సైన్యాలతో వారిమీదకు దండెత్తివచ్చి ఆద్వీపాలను ఆక్రమించుకొని, వారినందరిని ముస్లిములుగాజేసి అక్కడ చాలాకాలం వారు పరిపాలన చేసినట్లుగా చరిత్ర చెబుతున్నది. అందువలన మన సిద్ధాంతాలు, తత్వాలు ఎట్లా వున్నప్పటికీ మనదేశంనుంచి ఆక్రమణలు జరగకుండా ఉండుటకు సాధ్యమయినంతమిలిటరీని వృద్ధిచేసుకోవాలని మనవిచేస్తున్నాను. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక వాస్తవమునకు మొదటిదనే చెప్పాలి

ఆంధ్ర దేశంలో మొదటి పంచవర్ష ప్రణాళిక మనం అనుకున్నంత బాగా జరుగలేదు. ఆలస్యంగా జరిగింది. తరువాత ప్రభుత్వం నిలవలేదు. ఇంకా అనేకమయిన చిక్కులువచ్చాయి. ఈ సంవత్సరంలో తీసుకొని వచ్చిన అభివృద్ధి చాలా గొప్పదనే చెప్పుకోవాలి. ముఖ్యంగా ఆహారమునకు, వస్త్రములకు లోపం లేకుండా చేసుకున్నాము. ఈ ప్రణాళికలో కూడ అధిక ఆహారోత్పత్తి కొరకుగాను 1,013 కోట్లు కేటాయించబడింది. పరిశ్రమలకు రు. 1,331 కోట్లు, రవాణ సౌకర్యములకు రు. 1,384 కోట్లు, ఆ ప్రకారంగా రు. 4,800 కోట్లు కేటాయించబడింది. ఇంచుమించు 3,728 కోట్ల రూపాయలు రవాణా సౌకర్యములకు, ఆహారోత్పత్తికి, వస్త్రాలకు విద్యుచ్ఛక్తి మొదలయినవాటికి కేటాయించబడింది. మిగిలినవన్నీ చిన్న సంగతులు. వాటిని మనం చక్కబెట్టుకోవలసియున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలోనే వాటిని మనం చక్కబెట్టుకోవాలి.

ఈ అయిదు సంవత్సరములలోనే మనం అభివృద్ధి చెందాలని భావించరాదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తరువాత, తృతీయ, చతుర్థ, పంచమ ఆ ప్రకారంగా 30 సంవత్సరములు మనం ప్రణాళికలు తయారుచేసుకుంటే తప్ప మనం సంపూర్తిగా అభివృద్ధి చెందలేము. కాబట్టి సభ్యులందరూ వారి వారి గ్రామాలలో, తాలూకాలలో జిల్లాలలో ఉన్నటువంటి లోపాలనుబట్టి ఈ ప్రణాళికను విమర్శించకూడదని మనవిచేయుచున్నాను. మనం పర్యటనకుపోయి సభలలో మాట్లాడే

టప్పుడు ఈ పంచవర్ష ప్రణాళికను పంచమవేదంగా ప్రజలందరికీ నచ్చచెప్పి, వారికి దీనిమీద గాఢమైన విశ్వాసం కల్పించి, వారందరిని ప్రోత్సాహపరచి, వారు శ్రమదానం, ధనదానం చేసేటట్లుగా దీనిని నిర్వహించవలసి ఉన్నది. ఇక్కడ మనం మాట్లాడిన విషయాలన్నీ పేపరులో ప్రచురింపబడతాయి. ప్రజలందరూ చదువుకుంటారు. మనం ఇక్కడ ఒక విధంగా మాట్లాడి, రేపు సభలలో ఇంకొక విధంగా మాట్లాడినట్లయితే దీనినిగురించి ప్రజలు ఉత్సాహంతో పనిచేయడానికి పూనుకోరు. ఇది ఎంతమందో మేధావులు తయారుచేసిన పథకం, ఇది సాధించిన తరువాత ఏమైనా లోపాలుంటే వాటిని సరిదిద్దుకుందాము అనే విధంగా మాట్లాడుకోవాలి, కాని ఒక్కొక్కరు ఒక్కొక్కపుట, ఒక్కొక్క అక్షరం చొప్పున లోపాలను ఎంచుతూవుంటే మనం ఏమీకూడా సాధించలేము. దీనిని సభ్యులు మరువరాదని ప్రార్థిస్తున్నాను.

విద్య విషయంలో ఒక విషయం చెప్పవలసిఉన్నది. పంచవర్ష ప్రణాళికలో Government వారు కొన్ని మంచి సంస్కరణలు మూల సిద్ధాంతాలను చక్కపెట్టి బాగాచేస్తారనే ఆశ ఉంది. విద్య విషయంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 320 కోట్లు, కేటాయించ బడింది. అందులో Primary education కు 100 కోట్లు, technical education కు 49 కోట్లు కేటాయించబడింది. కాని ఇది ఏ మాత్రం చాలదు. ప్రజలకు విద్య చెప్పించడం అంటే అక్షరజ్ఞానం కలిగించడమేనని తృప్తిపడితే చాలదు. తరువాత వాళ్లు ఏమిచేయవలెనన్న ప్రశ్న కూడా ఉదయిస్తున్నది. 100 కోట్లు technical education కు కేటాయించి తక్కువ మొత్తాన్ని Primary education కు కేటాయించినట్లయితే బాగుండేది. Government సరైన పద్ధతిలో నడుస్తోందా అనేదాంట్లో నాకు కొంచెము భేదాభిప్రాయం ఉన్నది. Elementary education అంతా నెత్తిన వేసుకొని అయ్యవార్లకు సరైన జీతాలు ఇచ్చి వారిని తృప్తిపరచలేకపోతున్నారు, అందువల్ల ప్రతీ వాళ్లు education అంతా చెడిపోయిందని చెపుతున్నారు. Anni besant అనే ఆమె వ్రాసిన "Indian Nation" అనే పుస్తకంలో East India Company వచ్చినప్పుడు India లో 100 కి 50 మంది అక్షరజ్ఞులుగా ఉన్నారని వ్రాసినది. ఇప్పుడు మనం ఇన్ని పంచవర్ష ప్రణాళికలు పూర్తిచేసి పనిచేసినప్పటికి 100 కి 50 మంది కన్న ఎక్కువమందిని అక్షరజ్ఞులుగా చేయటంలేదు. 320 కోట్లు రూపాయలు ఖర్చు పెట్టినప్పటికి జనసంఖ్య పెరుగుదల వల్ల అభివృద్ధి ముందుకు పోవడంలేదు. అందువల్ల వెనుకబడి ఉండవలసివస్తున్నది. Buildings, School జీతాలు, అయ్యవార్లకు training ఇవ్వడం మొదలైనవన్నీ Government తనమీద వేసుకొన్నందున అభివృద్ధి చక్కగా జరగడంలేదు.
10 [illegible]

Sri P. Ramacharlu] [25th March 1956

ప్రజలకు ఇందులో పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చి వదలిపెట్టి వేస్తే వాళ్లను పుష్టితక్కువ, ప్రభుత్వానికి ద్రవ్య నష్టం ఎక్కువ అనే విషయాన్నికూడా గమనించ కోరుతున్నాను. Training School లో ఉపాధ్యాయులను చేర్చుకొనేటప్పుడే జాగ్రత్తపడాలి గాని కేవలం ఏమి తెలియకుండా ఉండేటటువంటి వాళ్లను, G.O. ను బట్టిగాని లేక కులక్రమాన్నిబట్టిగాని చేర్చుకోవడంవల్ల ఈ వ్యవహారంలో చాల లోపము ఉన్నదని మనవి చేస్తున్నాను. తక్కిన ఉద్యోగాలలో దామాషాతోనో లేక ఎక్కువ సంఖ్యను పెంచిగాని ఇవ్వవచ్చు. ఒక్క విద్య విషయంలో మాత్రం చాల జాగ్రత్త వహించవలసిఉన్నది. ఒక విద్యార్థిని అనంతపురం జిల్లా పటం వ్రాయరా అంటే Black Board చాలదు దేవరా అన్నాడట. అటువంటి వాళ్లను Training school ల్లో చేర్చుకోవడంవల్ల చాల నష్టం అవుతుందని గ్రహించి దీనిని మూలమట్టంగా సవరిస్తారని అనుకొన్నాను గాని చివరకు ఆశాభంగం పొందిన వాడనయితిని. ఈ పంచవర్ష ప్రణాళికను మనం అంతాకూడా బలపరచి ప్రతిగ్రామంలోను ప్రతిరాష్ట్రంలోను కూడా దీనినిగురించి ప్రచారముచేసి ప్రజలను ప్రోత్సాహపరచి పనులు చేయించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, 1920 సంవత్సరంలో జాతీయోద్యమంలో అడుగుపెట్టినపుడు అప్పటియువకులకు కొన్ని ఆశలు ఉండేవి. (1) స్వరాజ్యం (2) ఆంధ్రరాష్ట్రం; కొన్నిరోజులు జరిగినతరువాత planned economy దానితోపాటు విశాలాంధ్ర, ఈనాటికి దాదాపు ఆ యువకులందరికి కూడా ఒకవిధమైనటువంటి ఉత్సాహము వచ్చిందని చెప్పక తప్పదు. నేనుకూడా అందులో ఒకడినే. స్వరాజ్యం వచ్చినది. అటు తరువాత ఆంధ్రరాష్ట్రం, ఇప్పుడు విశాలాంధ్రకూడా వస్తున్నది. Planned economy కూడా వస్తున్నది. దానితోపాటు socialism నకు కూడా పురోగమిస్తున్నామనే విశ్వాసం కాంగ్రెసు రాజకీయసంస్థ ప్రకటించింది. దీనినిబట్టి కాంగ్రెసు చిత్తశుద్ధితో పనిచేస్తుందనికూడా నా విశ్వాసం. ఈనాడు మనకెదురుగా రెండో పంచవర్ష ప్రణాళిక ఉన్నది. స్వరాజ్యం వచ్చినవెంటనే అమలు జరపలేక పోయినప్పటికి మనకై మనం సాధించుకొన్నటువంటి రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం కాబోతున్నది. ప్రణాళికలో చేరడానికి బహుశా ఆరురోజుల వ్యవధిలోనే ఉన్నాము. ఇండియాలో ఉన్నటువంటి మేధావులు రాజకీయవేత్తలు బాగా ఆలోచించి ప్రణాళికను రూపొందించి ఉన్నారు. అక్కడక్కడ చిన్నచిన్న భేదాభిప్రాయాలు ఉన్నప్పటికి మొత్తంమీద రాజకీయపార్టీలు అన్నికూడా ఏకగ్రీవంగా అంగీకరించక తప్పదు. ఈ విధంగా భారతదేశం నూతన దశను అందుకోటానికి ఈ ప్రణాళిక రాజబాటగా ఏర్పడిందని చెప్పుతున్నాను. మనం ఒక ముఖ్యవిషయం గమనించవలసి ఉన్నది. ఈ ప్రణాళిక భవిష్యత్ ప్రజానీకానికని

మాత్రం మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. అమలు జరిపేది మనం ఒప్పజెప్పేది ప్రజలకు. ముఖ్యంగా మనది ఆంధ్రదేశం. విశాలాంధ్ర కూడా వస్తున్నది. దీనిని నందనవనంగా చేయాలనే ఆశ ప్రతివాళ్లకు ఉన్నది. దానికి కావలసిన ఆర్థికవిధానమేమిటో ఆలోచించవలసి ఉన్నది. ఆ ఆర్థికవిధానమే socialistic pattern of society అని చెపుతున్నారు. హెచ్చుతగ్గులు మారినప్పుడుగాని సమసమాజం ఏర్పడడానికి వీలు ఉండదు. ఆర్థికవిధానంలో భూస్వామ్యవిధానం ఒకటి ఉన్నది. ఇంతకుముందు మిత్రులు చెప్పినట్లు భూస్వామ్యవిధానంలో జమిందారీవిధానం పోయినది గాని భూస్వామ్యవిధానం పోలేదు. దానిని మార్చడానికి bills తీసుకువస్తామంటున్నారు. Committee లను వేస్తామంటున్నారు. 1600 రూపాయలు సంవత్సరం ఆదాయం కలిగినటువంటివాళ్లకు ఇంత ఉండాలని family unit గా నిర్ణయించి దాని ప్రకారం అమలుజరపమని చెప్పారు. దీనివల్ల ఆశయాలలో పొరపాటు లేదు ఉన్నతభావంలో పొరపాటు లేదు. చిత్తశుద్ధిలో పొరపాటు లేదు. కాని కార్యాచరణలో కుంటుపడుతున్నదనే విషయం మనమందరం ఆలోచించవలసి ఉన్నది. ఇది నేను ఒక పార్టీనిగాని, ఒక వ్యక్తిని విమర్శించాలనే ఉద్దేశ్యంతో చెప్పడంలేదు. భారతదేశంలో మనం national character ను build up చెయ్యవలసిన అవసరం ఉన్నది. "మనం విమానాలు కొనుక్కోవచ్చు శతఘ్నులు కొనుక్కోవచ్చు. ధాన్యం కొనుక్కోవచ్చు. కాని ఏదేశంనుంచి రానటువంటి వస్తువు ఒకటి ఉన్నదని" భగవంతంగారు world conference లో చెప్పారు. అదే nationa character. మనం అన్నిదేశాల సమస్యలను అర్థంచేసుకొంటాము. అన్నిదేశాల అభివృద్ధిని మనం అర్థం చేసుకొంటాము. దానిని గుడ్డిగా అనుసరించాలనే విషయం ఎక్కడాలేదని పూర్తిగా అంగీకరిస్తాము. కాని గుడ్డిగా, ద్వేషంగా చూడడం పనికిరాదనికూడా నేను మనవిచేస్తున్నాను. ప్రతిదేశముకూడా తన యొక్క స్వతఃసిద్ధమైన పద్ధతులలో తనకున్నటువంటి characterstic natureలో తనకున్నటువంటి ఆర్థికవిధానంలో ఆ ప్రజామనోతత్వంలో వాళ్ళంతాకూడా ముందుకు సాగిపోతున్నారు. కుజ్జివాళ్ళమైనప్పటికి స్వాతంత్ర్యరంగంలో వాళ్ళకన్న ముందుకుపోవడానికి మనకున్న అవకాశాలు వాళ్ళకులేవేమో ననుకుంటాను. ఎందువల్లనంటే చిన్నప్పుడు కుజ్జివాడు ఒంటెద్దుబండిలో పోయేవాడు. ఇప్పుడు విమానంలో పోతున్నాడు. 36 కోట్ల భారతీయులుకూడా బద్ధకంకణులై విద్యావంతులు కావలసిన అవసరం ఉన్నది. ఆదంతా ఇవ్వాళ్టిరోజున జరిగినటువంటి పరిణామము. ఇంత ఉత్సాహంగా ముందుకుపోయిన తరువాత మళ్లీ ఊళ్లలోకి పోయిచూస్తే ఏమీమార్పులేదు దేశం. అది నిజమే. విమానంలో కూర్చుని 250 మైళ్ళ వేగంతో పోతున్నాడని దూరముగాఉండి చూచేవాడికి తెలుస్తున్నది కాని

దాంట్లోనే ఉన్నవాడికి ఎప్పుడూ ఇందులోనే కూర్చోవలసివస్తోంది, ఎంతసేపు కూర్చోవాలో ఏమోననిపిస్తున్నది. అయితే అంతటితో సంతృప్తిపడితే లాభం లేదు దాంట్లో కూర్చుని దాంట్లోఉన్న లోపాలు ఏదో తెలుసుకుని దానిని పురోగమించే పనికి ప్రయత్నించిన విధంగానే ఈ రోజు ఈ ప్రణాళికనుకూడా తీవ్రంగా ఆలోచించవలసిన అవసరంఉన్నది. విశాలాంధ్రలో మొట్టమొదటగా జరపవలసింది భూసంస్కరణలని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. పంచవర్ష ప్రణాళికలో చెప్పబడిన సిద్ధాంతాలు ఏవైతే ఉన్నాయో వాటన్నిటిని నేను పూర్తిగా అంగీకరిస్తున్నాను. దానిని ఆమలు జరపడానికి గోపాలరెడ్డిగారిని నాయకత్వము వహించమని చెపుతున్నాను.

లేకపోతే, మనము హైదరాబాదుకు పోయేటప్పటికి మనకు తేడాలు వస్తాయి, చిక్కులు వస్తాయి. గోపాలరెడ్డిగారు నవ్వుతున్నారు, నాయకత్వం వహించడం ఎట్లాగాఅని. మీరు ఒకవేళ నాయకత్వం వహించకపోతే మీ కాంగ్రెస్ బలమంతా, జాతీయ బలమంతా మిమ్ములను లాగుకొని ముందుకు నెట్టుతుంది అనే విషయము జ్ఞాపకము ఉంచుకోవలెనని చెప్పుతున్నాను.

తరువాత ఆంధ్రరాష్ట్రముకు సంబంధించి ఈ ప్రణాళిక ఆలోచిస్తే 244 కోట్ల నుంచి 118 కోట్లవరకు ఇప్పుడు దిగాము. ఇది చాలా తక్కువగా ప్రారంభిస్తున్నాము. ఇంకా కొంచెము ఎక్కువవేస్తే మంచిది. ఇది రెండవ ప్రణాళిక కాదు. ఇదే మొదటి ప్రణాళికగా భావించవలసియుంటుంది అని చెప్పారు. మొదటి ప్రణాళిక అప్పుడే తాజాగా వచ్చినటువంటిది కాబట్టి దానికి అంత ప్రాముఖ్యత నివ్వడానికి వీలులేదు. కాని ఈ రెండవ ప్రణాళికను మనమందరముకలిసి, చర్చించుకొని ముందుకు నడవడానికి నిర్ణయించుకొనినటువంటిది. ఇట్లాంటి పద్ధతులతోటి జరుగవలసిన ప్రణాళికలు ఇంకా ఎన్నిజరుగవలెనో, అంటే మన ఆర్థికవిధానాన్ని ఒక ప్రణాళికా రూపములో నడపబోతున్నామన్నమాట. ఆంధ్రదేశములో ఉన్నటువంటి పరిస్థితులు అభివృద్ధికావాలి. ఈనాడు మొత్తం భారతదేశములో నిరుద్యోగ సమస్య తీవ్రంగాఉన్నది. దీన్ని ఏవిధంగా ఎదుర్కొంటాము అనేది ప్రధానమైంది. మనకు ప్రాజెక్టులు వస్తున్నాయి. ఇంకా రావలసినవి ఉన్నాయి. ఇవన్నీ ఇట్లాఉండగా, ఈ నిరుద్యోగ సమస్య ఏవిధంగా పరిష్కారం చేయవలసియుంటుంది ? ఏ ఆర్థిక వేత్త అయినా సరే, ఆర్థిక విధానములో పారిశ్రామికాభివృద్ధి రానిదే, వ్యవసాయక జీవితములో మార్పునిదే ఎప్పటికీకూడ ఈ నిరుద్యోగ నివారణకాదు అని చెప్పుతున్నారు. మనము అది basicగా పెట్టుకోవాలి. రెండవ పంచవర్ష ప్రణాళికకూడ అందుకే ఉద్దేశించబడినదని ప్రణాళికలో చెప్పారు అది చాలా సంతోషమే. రెండవది de-centralization

అమలు జరుపవచ్చునని చెప్పుతున్నాను. భారతదేశము మొత్తంగా అన్నిచోట్ల సమానాభివృద్ధికోసం ప్రయత్నించవలసి వచ్చినపుడు, ఆంధ్ర దేశము పారిశ్రామికంగా చాలా వెనుకబడినటువంటి ప్రాంతం కాబట్టి ; వెనుకబడిన చోట్ల కొన్ని పరిశ్రమలు పెట్టకపోయినట్లయితే, అనగా అచ్చముగా వ్యవసాయకంగానే ముందుకు వచ్చినప్పుడు అవతల వాళ్ల ఆర్థిక విధానానికీ ఇక్కడ వాళ్ల ఆర్థిక విధానానికి వాళ్ళ చైతన్యానికి, ఇక్కడ వాళ్ళ విధానానికి కొంత తేడా ఉంటుంది, చిక్కులు వచ్చేటటువంటి పరిస్థితి వస్తుంది. అందువల్ల చివరికి సమస్థితి రావడానికి పరిశ్రమలు కావాలని చెపుతున్నాను. ఆ పరిశ్రమలు ఏవి అంటె ఆ జాబితా అంతా చెప్పడం అనవసరమనుకొంటాను. అందువల్ల ఈ విశాలాంధ్ర మొత్తంలో ఒక పెద్ద పారిశ్రామిక ప్రాజెక్టును ఇవ్వవలసిందని కేంద్ర ప్రభుత్వమును, మళ్ళీ ఒకసారి గట్టిగా అభ్యర్థిస్తున్నాము. అందువల్ల, దీనితోపాటు మనకు ఉన్నటువంటి resources ఏమిటి అని ఆలోచించవలసియున్నది పారిశ్రామికాభివృద్ధి సాధించాము అన్నట్లయితే దాని తరువాత దేశంలో చాలా ముఖ్యమైనటువంటిది విద్య దేశం మొత్తంమీద చూచినప్పుడు, విద్యా విషయకంగా మనం చాలా తేలికగా ఆలోచిస్తున్నాము. కాని నా అభిప్రాయంలో, ప్రపంచంలో మనలను అగ్రస్థానంలో ఉంచడమో, నీచస్థానంలో ఉంచడమో తేల్చేది విద్యే. మన ఆర్థికాభివృద్ధి ముందుకు తీసుకుపోవడమో, వెనుకను తీసుకుపోవడమో తేల్చేది విద్యే కాని ఇప్పుడు standards పడిపోయినాయి, standards పడిపోయినాయి అంటున్నారు. ఇది standards పడిపోవడంకాదు అని నేను చెప్పుతున్నాను. Democracy లో సహజంగా ఉన్నటువంటి చిక్కులు ఏవైతే ఉన్నాయో వాటిని మాత్రమే మనము ఎదుర్కొంటున్నాము తప్పితే అసలు విషయంకాదు కనుక, standards పడిపోయినాయి అనేదికాదు ఇదికూడ ఇతర దేశస్థులతో చెప్పేటప్పుడే ఈవిధంగా చెప్పతాము. ఈ విషయంగురించి ఆలోచించుకొనేప్పుడు ఆత్మ విమర్శ చేసుకోవలసిన అవసరమున్నది మనము ఈ దినము ఏమి చేస్తున్నామంటే క్రింది తరగతి వారి standard తక్కువ అయితే, పై తరగతి వాళ్ళను పెడతాము. ఉదాహరణకు పూర్వము lower elementary ఉంటే, అది చాలా తక్కువ standard అని higher elementary తీసుకువచ్చాము. మరల higher elementary లాభములేదని, secondary grade తీసుకువచ్చాము. తరువాత secondary grade చాలదని higher secondary తీసుకొని వస్తున్నాము. Higher Secondary చాలదనుకొంటె, graduatesను తీసుకొనివస్తాము. ఇది ఎట్లున్నదంటె, ఇల్లు పునాది గనుక, క్రింద చెదలుకొట్టుతూఉంటె, ఇది లాభము లేదు, దీంట్లో ఉండలేమని ఇంటిమీద ఇల్లు, ఇంటిమీద ఇల్లు ఈవిధంగా కట్టితే, ఇల్లు మొత్తంకూడ కూలిపోయే పరిస్థితి వస్తుంది. కనుక ప్రస్తుత విద్యా విధానంలోకూడ అదే పరిస్థితి రాబోతుందేమో అనే

అనుమానం ఉన్నది ఈ పంచవర్ష ప్రణాళికలో గనుక ఈ Higher Secondary Education ప్రారంభించినట్లయితే ఆ పరిస్థితి తప్పకుండా వస్తుందని నేను మనవి చేస్తున్నాను. అందువల్ల ఈ విద్యావిధానంలో మన పరిస్థితి గురించి కేంద్ర ప్రభుత్వం వారికి మనము చెప్పవలసిన అవసరమున్నది. వాళ్లు చెప్పేటటువంటి standards బాగానే ఉండవచ్చు. కాని మనకు డబ్బులేదు. మాకు ఉన్న అవకాశాలు తక్కువగాఉన్నాయి. దాన్ని అభివృద్ధి చేసుకోవలసినటువంటి జాతీయబాధ్యత మనందరిమీద ఉన్నది. కాని భరించలేనటువంటి విద్యా విధానాన్ని పెట్టి దాన్ని నడపమంటే చాలా కష్టమవుతుంది. ఈ సందర్భంలో చైనామిత్రుడు ఒక విషయం చెప్పారు "చైనాదేశంలో technical experts ను తయారుచేసేటప్పుడు రెండు సంవత్సరముల courses వాళ్లకు ప్రారంభించాము. ఆ రెండు సంవత్సరముల courses లో తయారైనవారె మాకు personal గా ఏర్పడ్డారు, బయట వారెవరు రాలేదు మాకు" అని చైనామిత్రుడు చెప్పినట్లు చెప్పారు. ఆవిధంగా వారు దేశభక్తితోటి ముందుకువచ్చారు. తెల్లవారులు నేర్చుకొని, ఇది నాదేశము, ఈదేశాన్ని నేను నిర్మిస్తున్నాను, ఈ ఇల్లు కట్టింది నేను, అనే మనోభావముతోటి, దేశాభిమానంతోటి ఆ చదువు అంతా నేర్చుకొని పనిచేస్తూ రెండు సంవత్సరములలో మన సాధారణపు ఇంజనీర్లకు సమానంగా వారు వచ్చారు. దీనినిబట్టి మనవాళ్లకు దేశభక్తి తక్కువ అని నేను అననుకాని ఆవిధమైనటువంటి educational system ను తీసుకురాకుండా పాత పద్ధతులనే అమలు జరుపుతామంటే మాత్రము, మనము ఈ national building లో ముందుకుపోలేము అని ఖచ్చితంగా చెప్పుతున్నాను. ఇదివరకు మన రాజకీయ విధానము ఈ పరిపాలనావిధానము దేనిమీద ఆధారపడింది అంటే, పోలీసు రాష్ట్రంమీద ఆధారపడింది. అందుచేత ఇది పనికిరాదు, దీన్ని మార్చాలని గోర్వాలా ఖచ్చితంగా వ్రాశారు. ఇప్పుడుపంచవర్ష ప్రణాళికలోగూడ ఇదేవిషయం చెప్పారు. ఇందాక నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ, electricity ఇచ్చినట్లయితే నేను socialism తెస్తాను అని Lenin అన్నాడని చెప్పారు. అంతేకాదు, "Electricity plus Soviets will become socialism" అని ఇంకోమాటకూడ Lenin చెప్పారు. ఇప్పుడు ప్రజాస్వామిక మొకటి అయింది. గ్రామ పంచాయితీలు మొదలుకొని అది అందరం ఒప్పుకొన్నాము. దానికే, మనందరికి ముఖ్యుడైనటువంటి ఫణిక్కర్ గారు ఒక articl వ్రాస్తూ చెప్పారు. Parliamentary layers లో నేకొదు, క్రింది అన్ని layers లోను, ప్రతి ఒక్క layer లోను మీరు Democracy ని అభివృద్ధి చేసినప్పుడే నిజమైన democracy అవుతుంది లేకపోతే లేదు అని చెప్పారు. నేను చెప్పేది, ఈ జిల్లా బోర్డులు పాతపద్ధతిలో అనవసరమని అనుకొన్నాము. ఈ సందర్భంలో planning

committee వారు ఒకవిషయం చెప్పారు. ప్రజాస్వామికము నడపడానికిగాని, పారిశ్రామికాభివృద్ధి నడపటానికిగాని జిల్లా అనేది చాలా ప్రధానమైనటువంటి unit, గనుక దానికి కావలసినటువంటి పద్ధతులు మీరు ఆలోచించండి అని చెప్పారు. నేను చెప్పేది, district level లో, ఈ district advisory councils, అటువంటివన్నీ తీసివేసి ఒక elected committee నివేసి దానిద్వారా మన planning అంతా కూడ జరిపించడం అవసరమని నేను మనవి చేస్తున్నాను.

MR. SPEAKER :—మీరు మొన్న ఇచ్చిన cut motion దీంట్లో లేదు. ఇదంతా మాట్లాడుతున్నారు మీరు అందుకని చెప్పుతున్నాను, మీరు ఇంకొక నిముషములో ముగించాలి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—నాకు ఇంకొక 5 నిమిషాలు ఇవ్వవలసిందని కోరుతున్నాను.

Mr. SPEAKER :—అయితే రేపు continue చేయండి.

The House was then adjourned to meet again at 8-30 A. M. the next day.